శ్రీ

# లంకాదహనము.

## (సీతాన్వేషణము.)

అయిదంకముల నాటకము,

ద్రోణంరాజు శీతారామారావు విరచితము.

ఇందుల కీర్తనలు

అల్లక చంద్రశేఖరం గారిచే

రచియింపబడినవి.

భీమడోలు కాపురస్తులు బుక్కుసెల్లరు

కురుకూరి సుబ్బారావుచే

ప్రచురింపబడియె.

మూడవ కూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

స్కేప్ అండు కో., క. సుబ్బారాయుడు బ్రదర్సువా వలన

ముద్రితము.

ట్ గజస్టగ

# ఇందువచ్చు పాత్రలు.

శ్రీరాముడు.

లక్ష్మణుడు.

జటాయువు.

సుగ్రీవుడు.

వాలి.

హనుమంతుడు.

రావణుడు.

విభీషణుడు.

విప్రజిత్తు, విరూపాక్షు, ధూమ్రాక్షు, మందపాలకులు. } రావణుని సేవకులు.

"స్త్రీలు."

సీత:—రాముని భార్య.

రుమ:—సుగ్రీవుని భార్య.

తార:—వాలి భార్య.

లంకిణి:—రాక్షసి.



శ్రీ

# లంకాదహనము

[సీతాన్వేషణము]

ప్రథమాంకము.

రంగము:—అరణ్యము.

[శ్రీరామలక్ష్మణులు ప్రవేశము]




రాము—2 అనుబంధము.

తమ్ముడా లక్ష్మణా! నేడేలనో యెన్నడదరని యెడమకన్నదరు చున్నయది. మనంబపరిమిత పరితాపంబొందు చున్నయది. సీతజాడా కింతయైన గానరాకుండె. అయ్యో! నాకిప్పుడేమి దోచకుండె.

తే. గీ. పూర్వజన్మంబునందు నే ♦ పొలతిగూడు
పతినిగడుమాయచే నెడ ♦ బాపినాను
యట్టిఫలమును నేనిప్పు ♦ డందుచుంటి
ధాతవ్రాతను దప్పింప ♦ దరమెజగతి.

(సీతనుద్దేశించి) హాసీతా! భువనపూతా! ఎందుబోతివి! నీవు గనపడకుండిన నాజన్మవ్యర్థముకదా.

మ. వనితా ప్రాణవిభుఁ రఘూద్వహు ♦ నిబ్బంగిఁ విడంజాలి యే
వనమందుంటివో లేక యెల్లగితో ♦ బ్రాణేశుచిత్తంబునుఁ
గననేమూలనుడాగితో యిపుడు ♦ వేగఁ వచ్చి నాయార్తినిఁ
గనిబ్రోవందల బూనగదవె ♦ సత్కారుణ్యాసంధాయివై.

రమణీ యింకను నాయెడల నీకు సంశయమా.

తే. గీ. రాముహృదయమెరుగుదువు రామనీవు
నీదుహృదయం బెరుంగుదు నేనుకాంత
యింకశోధింపగానేల శంకదక్కి
ప్రాణవిభుగాంచ నేతెంచు పద్మగంధి.

లక్ష్మ—అన్నగారు సీతావియోగసంజనిత దుస్తరదుఃఖాంభోధిని గూలినారు. ఈసమయంబున సీతని నెట్లూరడింతు. అక్కటా! నాకేమార్గంబును దోచకున్నయది (రామునిసమీపించిప్రకాశముగా)

3 అనుబంధము.

సహజధైర్యచిత్తుండవై నీవీరీతినూరక దీనునికైవడి మానముచెడి వగవ నే నేమనగలను. సర్వజ్ఞులరు మీ రెఱుంగని దేమున్నది.

రాము—తమ్ముడా! నేనేమని వచింతును. ఆజానకి నాతో గలసియుండెనేని యీయరణ్యంబు నాకువసంబుగను, పర్ణకుటీరములు సౌధంబులుగను, కందమూల ఫలంబులు పంచభక్ష్య పరమాన్నంబులుగను దోచుచుండెడివి. ఇప్పుడదేమో నాచిత్తమెల్లను దత్తరించుచు నాకేమియు దోచకుండె. ఐననీవృక్షముల సీతజాడ నడిగి తెలిసికొనియెద (ప్రకాశముగా) ఓవనవృక్షములారా.

సీ. ఘనసారభూజంబ కానవే నీవంటి
గంధంబుకల యట్టి కరటియాన
కదళికాతరురాజ కానవేనీయట్టి
మెఱుగుబెందొడలమా మానవేత్రి
విలసిల్లు చంపక వృక్షంబ కానవే
లలినీదు పువ్వువి లాసనాస
కమనీయలతనీవు కానవేనీయట్టి
కరములు శోభిల్లు కంబుకంఠి

గీ. క్రముకధరణీ రుహాధీశ కానవయ్య
నీఫలస్ఫూర్తి కంఠంబు నీలవేణి
కళికలనుమించుసవ కుంద కానవమ్మ
నీదుకోరక నిభదంత నీరజాస్య.

అయ్యో! ఈవృక్షములలో నొక్కటియు మాట్లాడదయ్యెహాసీతా!

4 అనుబంధము.

హాసీతా! వనితాజన విఖ్యాతా! జనకజాతా!

లక్ష్మ—అగ్రజా!

తే. గీ. వంతగూలగనేల యా యింతికొరకు
నరయుదమువన ప్రాంతంబు లందునామె
గానుపింపకయున్న మా ర్గంబునొండు
జూదమామీద దప్పక శుభచరిత్ర.

రాము—తమ్ముడా! నీకొక్కటి జెప్పెద నాలకింపుము.

ఉ. ఏవనికేగుదెంచు నెడ నింటనునుండగ లేనటంచు స
ద్భావముతోడ బల్కి ఘన భాగ్యములెల్ల బరిత్యజించి నా
తోవనికేగుదెంచు నవ తోయజపత్రి విశాలనేత్రి సీ
తావనితాలలామకయి తాపమునందక యుండ నేర్తునే.

అయ్యో! నేనింక ఆయన్నుల మిన్నను కన్నులార జూడగల్గు దునా! నన్నన్వేషింప యెన్నియిడుమలు బడుచున్నదో లేక యీయ డవులయందు నడువలేక యేమూలబడియున్నదో యేదనుజుని మాయలో జిక్కినదో. ఉన్నదో. లేదో హా. హా.

లక్ష్మ—అన్నయ్యా! చింతిలకుము. సర్వలోకమాతయగు సీతామహాదేవికెట్టి యాపదయు సంభవించియుండదు గాని యేదనుజ మాయయందు బడియున్నదో యని మాత్రము నాకును సందియము గల్గుచున్న యది. అదియే నిజమయ్యె నేని.

[కోపముతో]

ఉ. చించెద దైత్యసంఘముల ♦ చిందఱవందఱజేసి బ్రహ్మబా
ధించెదలోకపాలకుల ♦ ద్రెళ్ళగనేసెద భూతలంబు గ్రు
క్కించెద శైలజాలముల గీ ♦ టడగించెదభూమి నందనన్
గాంచెదదల్లడిల్లకుము ♦ కంజహితాన్వయ వార్ధిచంద్రమా.

కావున మనమింక సత్వరముగ నరుగవలెను.

రాము—మంచిది. (అనిముందుకు నడుచును)

లక్ష్మ—అన్నయ్యా! అటుచూడుడు. వాడెవడో యొక దను జునివలెనున్నాడు. సీతాదేవి నపహరించి, మనము వచ్చుచుండుట జూచి యేమియునెఱుంగని వానివలె మౌనమును దాల్చి యచ్చట బండుకొని యున్నాడు.

(బాణమును సవరించుకొని)

అగ్రజా! శ్రీరామచంద్రా! సెలవైనచో

తే. గీ. శరముసంధించి యిప్పుడా ♦ సురవిరోధి
దునుమువాడను జూడుమీ ♦ దోర్బలమున

రాము— వలదుతమ్ముడా యతడు ♦ దేవారికాడు
వానిసంగతి నరయంగ ♦ వలయుమనము.

(పడియున్న జటాయువునుసమీపించి)

శ్రీరా—(జటాయువును సమీపించి) తమ్ముడా! ఈతడె వ్వడో యొక పతంగేంద్రుడు విగతపక్షుండై నేలఁబడి మూర్ఛిల్లియు న్నాఁడు. పాపమిందులకు గారణమేమైయుండునో! (జటాయువుచేయి బట్టుకొనిచూచి) శరీరంబును బ్రాణములుమాత్రమున్నవి. నెమ్మదిగాఁ బిలచెదను. (జటాయువు శరీరముపై జేయివైచి) ఓయీ! నీవెవ్వరవు? నీకేల యిట్టిదశ వచ్చినది? మేము రామలక్ష్మణులము నీ దుర్గతికి గారణంబు జెప్పితివేని తగునుపచారము సేయ బ్రయత్నించెదము.

జటా—(కన్నులు విప్పిచూచి) ఏమి ! మీరు రామలక్ష్మణులా ! దశరథపుత్రులేనా ?

శ్రీరా—అవును.

జటా—నాభాగ్యవశమున మిమ్ములఁ జూడఁగంటిని. మీకొఱకే ప్రాణంబులు నిల్పియుంటిని. శ్రీరామలక్ష్మణులారా ! రఘుకుల సంజాతులారా ! నేను పతంగకులనాథుండను. జటాయువనువాఁడను. మీతండ్రికెంతయుఁగూర్చు సఖుండను. రామా ! నేనీవనంబున విహరింపుచుండ, లంకాపురాధినాథుండగు రావణుం డొక్కవనితను రథముపైఁ బెట్టుకొని పోవుచుండెను. ఆరథంబుపై వేటకానికిఁజిక్కిన కురంగంబు చందంబుననున్న యాకాంత యరణ్యంబంతయుఁ బ్రతిధ్వని యిచ్చునట్లు,

శా. హా! కాకుత్స్థకులాబ్ధిచంద్ర! రఘురా ॥ మా! రామభూమీశ్వరా
లోకోపద్రవదైత్యవంశదహనా ॥ లోకేశ్వరా! నేఁడు ర
క్షోకాంతుండిటునీవులేనపుడునన్ ॥ గొంపోవుచున్నాఁడు రా
వే? కారుణ్యముజూపవే! యసురునిన్ ॥ వేగూల్పవేచంపవే.

అని విలాపింప నేనది విని యామె నీభార్యయని గ్రహించి కడురయంబునఁ బోయి రావణుని యరదంబున కడ్డుపడి వానితో ఘోరసంగ్రామ మొనర్చితిని. తుదకు రావణుండు నన్ను విగతపక్షునిగా జేసి సీతాదేవిం దోడ్కొనిలంకాపురాభిముఖుండై పోయెను. నాశరీరమంతయు నొచ్చుచున్నది. నీకీవార్త వినిపించుటకే జీవించితిని. ఇంక నామేనఁబ్రాణంబులుండవు. నేను మరణించెదనని చింతింపనుకాని.

తే. గీ. భవ్యగుణుఁడైన జనకభూ ॥ పాలుపుత్రి
దశరథునికోడలును నీదు ॥ తన్వియువగు
సీత లోకైకమాత యా ॥ చెనటిచేత
జిక్క విడిపింపలేదంచుఁ ॥ జింతపడుదు.

శ్రీరా—పక్షీంద్రా ! కాలగతి నెవ్వరు తప్పింపగలరు ? ఉపకారమునకు బోయిన నపకార మెదురయ్యె ననుమాట నేడు సత్యమైనది. నిర్నిమిత్తముగ మాకొఱకు రావణునితో ఘోర సంగ్రామ మాచరించి యిట్లయితివి. నీయుపకారము మేమెన్నటికిని మఱచువారము కాము ! మాతండ్రికి స్నేహితుండవును, పెద్దవాడవును నగుటం జేసి నీవు మాకు తండ్రితో దుల్యుండవు. నీవు ప్రాణంబులు బాయ నుంటివని మాత్రము మేము విచారింపుచున్నాము.

జటా—రామా ! ఇంక నాశరీరంబునం బ్రాణములుండవు. ఇంకొక్కమాట చెప్పవలసి యున్నది. మీరీమార్గమున బోయితిరేని యొక్క కపివలన మీకార్యంబు నెఱవేరును.

తే. గీ. కన్నులను జీకటులిపుడు గ్రమ్ముచుండె
నొడలువశముగాకింతయు నొప్పుచుండె
మాటరాకుండె నిప్పుడు నోటివెంట
దివిజలోకంబుజేరెద దివ్యచరిత
రామ శ్రీరామ జయరామ రామరామ.

(ప్రాణములు విడుచుచున్నాడు)

శ్రీరా—ఎంతకష్టమెంతకష్టము ! పతంగేంద్రా ! నీవు ముక్తి నందెదవుగాక ! (లక్ష్మణునిఁజూచి) తమ్ముడా ! మనకుపకారము సేయఁదలంచి తుదకీతడెట్లయ్యెనో కంటివా ! ముందుగా మనమీతనికి దహనకృత్యములు సలిపి యనంతరము సీతాన్వేషణంబున వర్తింతము.

లక్ష్మ—మంచిది.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రథమాంకము.





శ్రీ

# లంకాదహనము.

## (సీతాన్వేషణము.)



ద్వితీయాంకము.





రంగము:—కిష్కింధపుర ప్రాంతోద్యానవనము.

[ప్రవేశము:—శ్రీరామ లక్ష్మణులు]

శ్రీరా—తమ్ముడా! సకలప్రదేశంబులయందును సీత నన్వేషించితిమిగాని యెందును నామెజాడ కానబడలేదు. ఇంక నామె కనంబడుట కల్ల.

తే. గీ. సీత లేకున్న రాముని జీవమేల
భాగ్యభోగ్యములేల సంపదలవేల
సన్నుతీంద్రుని రీతిని సంచరింతు
తమ్ముఁడా నీవుపురికింకఁ దరలుమయ్యా.

సత్యవాక్పరిపాలనంతరంబందైననుజానకి లేకుంటచే నేను పురంబునకు రానొల్లను. ఈయడవులయందే తనువు వెళ్ళదీసెదను—(సీతనుద్దేశించి)

మ. గరితా! నన్నెడబాయ జాలకను సౌఖ్యశ్రీలనుంబాసి దు
ష్కరదుర్దాంతదురంతదుస్సహమహోగ్రక్రూరమాకానలన్
జరియింపంజను దెంచియీాకరణినో జంబ్రేమముల్ వీడి యెం
దరుగన్ జాలితివీవు నన్విడిచియో యజ్ఞాతపత్రేక్షణా.

2

సీ. మహనీయమణిమయ । మందిరంబులెయౌను
పర్ణశాలలునాకు । బద్మగంధి
అతిమోదమిచ్చు న । ద్యానవనములౌను
కాననంబులునాకు । కంబుకంఠి
షడ్రసోపేత భో । జనముగానొప్పును
కందమూలమునాకు । గరితమిన్న
హంసతూలికపాన్పు । లౌచును రాజిల్లు
దర్భశయ్యలునాకు । దలిరుఁబోడి
తే. గీ. కష్టములుజూడ మిగుల సౌ । ఖ్యములెయగును
చింతమదికి సంతోషమై । చెలగుచుండు
సలదరిద్రమునాకు భా । గ్యంబెయగును
నీవునాదండనున్నచో । నీరజాక్షి.

అట్టినిన్ను విడిచినేనింక నీజగంబుననెట్లు బ్రతుకగలను!

ఉ. భూమితనూజ సీతకడు । ముగ్ధవనంబులయందు మీరల
ట్లీమెనుజూతురోయనుచు । నెంతయుజెప్పెను మానుతల్లి యి
ప్డీమగువన్ వనంబునను । నీకరణిన్ విడి యింటికేఁగ దా
నేమనిదూఱునోమనల । నేమియు దోఁచకయుండెలక్ష్మణా.

లక్ష్మ—అన్నయ్యా! ఏలయీచింత! లంకాధిపతియగు రావణుండను దైత్యుండు సీతనపహరించినాడని జటాయువువలన నొక్కింత వింటిమికదా!

శ్రీరా—(కోపముతో) ఓరీ! రావణా! దుర్మదాంధా!

మ. ఇదిగోవచ్చుచునుంటి రాముడనురా । ఏమూలయందుండినన్
బదియాఱువ్రక్కలు సేతునీశిరములన్ । బాహాబల ప్రౌఢిమన్
మదిరాక్షిన్ వనమందునుండఁగఁగదున్ । వంచించితెత్తెచ్చినా
యెదుటన్ నిల్చిబలంబు జూపుమికనీ । వెంతైనదైత్యాధమా.

(పోబోవుచున్నాఁడు)

(రాముని వారించి)

లక్ష్మ—అగ్రజా! ఇచ్చట రావణుఁడు లేడు. జటాయువువాక్యము విని యుండుటచే నిశ్చయముగా రావణుఁడెదుట నున్నాడని యిట్లు కోపావేశంబున బలుకుచున్నారు తొందరపడకుడు.

తే. గీ. అలదశాస్యుని జాడల ◊ నరసి వాని
భీకరాజినిబరిమార్చి ◊ పృథ్విసుతను
మించుముదమున దెచ్చి య ◊ ర్పించి నీకు
ధన్యతను గాంచెదను నేను ◊ ధర్మమూర్తి.

కావునఁ గొంతకాల మోపిక బట్టుటకుఁ బ్రార్థింపుచున్నాను.

శ్రీరా—తమ్ముఁడా! అది యెక్కడిమాట. ఆజటాయువు ప్రాణప్రయాణకాలమున సీత రావణునిచే నపహరింపఁబడినదని చెప్పెను గాని యాలంకాపుర మెక్కడనున్నదో దానికి మార్గమెట్లో యాసంగతులన్నియు మనకు సవిస్తరముగ జెప్పలేదు. అయ్యది మనకెట్లు తెలియును? యిదియంతయు వట్టిమాస. ఏమైననుసరే. మదీయనిశితశరపరంపరలఁ గప్పి చతుర్దశభువంబులను భస్మీపటలము గావించెదను. అప్పుడైనను సీత యెక్కడనున్నను బ్రహ్మేంద్రాదులాసీతనుదెచ్చి నాకర్పింపకయుందురేమో చూచెదఁగాక.

(శరమును సారింపుచున్నాఁడు)

లక్ష్మ—అన్నయ్యా! ఆగుము.

తే. గీ. రాక్షసుడెవండొ గొంపోయె ◊ రమణిమిన్న
వానినెమకి రణమున ద ◊ ర్పంబునడప
వలయు గాక లోకములపై ◊ నలుకజూప
ధర్మమే కిక్కమానుము ◊ ధర్మచరిత.

శ్రీరా—సరే. ఇదిగో హృదయమును రాయిగా జేసికొంటిని. కాని యాదైత్యుడున్న తావు మనకెట్లు తెలియును?

లక్ష్మ—ఒక్కకపివరునివలన మన కార్యంబు చక్కపడునని జటాయువు వచించెనుకదా; అతఁడు మనకుఁ గనిపింపకయుండునా? ఇప్పుడు మనముచేరిన ప్రదేశమంతయు, వానరమయముగా నున్నది. మనలను జూచి యాకోతులన్నియు, కిలకిలారావంబులు సేయుచు నలుదెసలం బరుగులిడుచున్నవి.

శ్రీరా—కోతిచేష్టలని చెప్పిరికదా. వాటిచేష్టలవి మానునా! అదుగో యెవ్వఁడో యొకవానరుండిట్లు వచ్చుచున్నాఁడు.

[హనుమంతుఁడు ప్రవేశించును.]

హను—(తనలో) ఎవ్వరో యిరువురు రాజపుత్రులీ వనప్రాంతమున విహరింపుచుండిరనియు, వారింగాంచి వానరులందఱును బరుగెత్తుచుండిరనియు, ఒకవేళ వాలికి సహాయంబొనర్ప నరుదెంచిరేమో యని నాకుఁ గూడ భయముగలుగుచున్నదని, వారి సమాచారము నారసిరమ్మని సుగ్రీవుండు నన్ను బంపినాఁడు. ఇదుగో ఆరాజకుమారులు (పరిశీలించి) ఏమిది! వీరిముఖంబులు జూడ రాజకుమారులవలెఁ దోచుచున్నది. వేషముల నీక్షింప తాపసవృత్తినిఁ జరించువిధము దోచు. ప్రపంచకమంతయు నేలఁదగిన వీరీరీతిని వనంబులందు జరించుటకుఁ గారణమేమో కదా! సమీపించి వీరివృత్తాంత మడిగెదనుగాక. ఇంతలోహాని యేమున్నది? (రామలక్ష్మణులను సమీపించి ప్రకాశముగా) పుణ్యమూర్తులారా! నమస్కారము లందుకొనుఁడు.

శ్రీరా—వానరోత్తమా! నీవెవ్వరవు?

హను—మహాత్ములారా! కేసరియను వానరోత్తమునకు నంజనీదేవియందు నీశ్వరప్రసాదమున జనించిన వాఁడను. హనుమంతాఖ్యుఁడను. ఇచ్చట ఋష్యమూకగిరియందున్న ప్లవంగఱేఁడగు సుగ్రీవుండను వానికి మంత్రినై యుందు ఇది నావృత్తాంతము.

తే. గీ. తపసివేషంబు లీక్రితి దాల్చియిట్లు
నేగుదెంచి భవ్యాత్ము లీరలెవరొ
పరమదయఁబూని పల్కుడీ భానుసుతుఁడు
మీదువార్తను నరయఁ బంపించెనన్న.

ఆభానుపుత్రుండగు సుగ్రీవుఁడు తనయన్నయగు వాలితోఁగలహమాడి యాతని భయంబునం జేసి ఋష్యమూకగిరియందు వసింపుచున్నాఁడు.

లక్ష్మ—అన్నగారితో సుగ్రీవునకుఁ గలహమేల వాటిల్లెను?

హను—ఏమున్నది? కామాంధకార నిమగ్నులైనవారు ధర్మాధర్మముల నరయరుకదా! సుగ్రీవుని భార్యయగు రుమను వాలియపహరించి తనయొద్దనుంచుకొనుటయే దీనికి కారణము.

శ్రీరా—(హనుమంతునితో) ఛీ! ఎంత యవివేకము! ఎంత పాపము!

ఉ. తమ్మునిభార్యయంచు గను దల్పక ధర్మమునెంచకుండఁ జి
త్తమ్మున మోహమంది పర దారనుదెచ్చెనె పాపభీతి లే
శమ్మును లేక నాకరణి సాహసమూనుచు నింక నెల్లు లో
కమ్మున ధర్మముల్ నిలచు కాలుడు సైచునె యిట్టివారలన్.

అప్పుడు సుగ్రీవుడేమి సేయఁగల్గెను?

హను—ఏమిచేయఁగలడు. ఓపినయంతవఱకు వాలితో బోరాడెను కాని, వాలిబలంబధికమై యుండుటచేత భీతిల్లి పురంబువిడిచి యీగిరియందు దనయనుచరులతో నివసింపుచున్నాఁడు.

పుణ్యమూర్తులారా! మీరెవ్వరో యానతీయుఁడు.

5 అనుబంధము.

లక్ష్మ—హనుమంతా! మేము రఘుకుల సంభూతులము. దశరథ భూపాలుని పుత్రులము. ఈతఁడు నాయన్నయగు శ్రీరామచంద్రుఁడు. పితృవాక్పరిపాలనార్థమై యీతఁడు జాయాసహితముగా నర

ణ్యముల కరుదేర నేనీతని బాయజాలక వెనువెంట వచ్చితిని. దండకా వనంబునం బర్ణశాలయందుండు తఱిని నొక్కదైత్యుండు మమ్ము వంచించి మాపదినెయగు సీతను నపహరించుకొని పోయినాండు. తదన్వేషణార్థమై యిట్లుబయలుదేరి వచ్చితిమి.

హాను—రామలక్ష్మణులారా ! సమయమునకు జ్ఞాపకమువచ్చినది. ఇటీవలం గొన్నిదినంబుల క్రిందట లంకాధిపతియగు రావణుం డొక యబలను దనరథముపై బెట్టుకొని పోవుచుండగా నామెవిలపించుచు తనభూషణంబులను నొకగుడ్డమూటను గట్టి యీగిరిపైం బడ వైచినది. అయ్యవి సుగ్రీవానుచరులగు వానరులకు దొరంకగా వారు వాటిం దెచ్చి యాతని కర్పించిరి. అయ్యవి సుగ్రీవుండు కడుభద్రముగా దాచియుంచినాండు? మీరచ్చటికరుదెంచి వాటిందిలకింపవచ్చును. ఒక వేళ నయ్యవి సీతామహాదేవివై యుండునేమో ! అది యట్లుంచుండు. సుగ్రీవుండు పరమసద్గుణమూర్తి. మీాసఖ్యముసేయుట కాతండుమిగుల సంతసించును. సీతాన్వేషణ కార్యమాతనివలన నాతని సహాయమున జక్కంబడంగలదు. కావున గృపాంతరంగులై యచ్చటికి విచ్చేయుండు.

శ్రీరా—(లక్ష్మణునిం జూచి) హానుమంతుండు చెప్పిన భూషణములం జూడ నాచిత్తము మిగులతత్తరమందుచున్నది. సుగ్రీవునికడకీ హానుమంతునివెంట నేగుదము రమ్ము.

లక్ష్మ—చిత్తము.

హాను—ఇటురండు. (అందఱును నిష్క్రమింతురు.)

రంగము:—ఋష్యమూకగిరి.

[ప్రవేశము:—శ్రీరామ లక్ష్మణులు-సుగ్రీవుడు-హానుమంతుండు]

శ్రీరా—(లక్ష్మణునింజూచి) తమ్ముండా ! ఇప్పుడు మనము జూచినవన్నియు, సీతయొక్కయాభరణంబులే. అందులకొక్కింతయు సంది

యము లేదు. (సుగ్రీవునిఁజూచి) సుగ్రీవా! నవభూషణంబుల నతిజాగరూకతతో దాచి మాకు గనఁబఱచి సంతోషము గలుగ జేసినందులకు నేనెప్పుడును నీకుఁగృతజ్ఞుఁడనై యుండువాఁడను.

సుగ్రీ—దేవా! నేనుమీయాజ్ఞకుఁ బాత్రుఁడనే కాని, వినుతికి మాత్రము బాత్రుఁడనుగాను.

తే. గీ. వాలినాభార్యను హరింప ¶ బలములేని
వానినాజినినోర్వఁగ ¶ భయముచేత
యనుచరులతోఁడ నిచ్చట ¶ నలరుచుంటి
నెట్లురక్షించెదోనన్ను ¶ నినకులేశ.

హను—ఇవ్విషయమున భానుజుఁడు మీశరణంబు నందుచున్నాఁడు.

శ్రీరా—(సుగ్రీవునిజూచి) సుగ్రీవా! ఉపకారము సేయఁదలంచినవారికి ప్రత్యుపకారము సేయనెంచు ధర్మపరుల లక్షణమైయున్నది. నీచరిత్రంబంతయు హనుమంతునివలన వినియుంటిని. ఇంక నీవు మనంబున భయంబు దక్కియుండుము.

తే. గీ. ధర్మహీనుడై నీదగు ¶ దార నపహ
రించిన దురాత్మునాజి వ ¶ ధించి నీకు
ముదము నొడఁగూర్చి కిష్కింధ ¶ పురికినిన్ను
బతిగజేయుదు నమ్ము నా ¶ పల్కు సఖుడ.

నేటినుండి మన మిరువురమును సఖులమైతిమి. ఇంక నీవు భయమువిడిచి వాలిని రణమున కాహ్వానింపుము. ఆతఁడు నీపైకి నరుదెంచును. మీరిరువురును గయ్యముసేయు సమయమున వాలిని నేనువధించెదను.

హను—దేవా! రామా! వాలియు, సుగ్రీవుండును రూపంబున నొక్కతీరుగనే యుందురు. వీరిరువురును రణముసేయు సమయమున నీవు మిగుల జాగరూకతతో నుండవలయును.

సుగ్రీ—మహాత్మా! రామచంద్రా! యుద్ధసమయమున నేను కంఠంబున నొక్క పుష్పహారంబు నలంకరించుకొందును. ఆయానవాలునుబట్టి నీవు వాలింబడఁగొట్టుము.

శ్రీరా—మంచిది. ఇంక నీవు సంశయింపకపొమ్ము.

(సుగ్రీ, హను, నిష్క్రమింతురు.)

శ్రీరా—(లక్ష్మణునిఁజూచి) తమ్ముడా! జటాయువు వచించినది సత్యమైనది.

తే. గీ. వాలిననిలోనఁ దెగటార్చి । భానుపుత్రు
రాజుఁజేసిన జనకజా । రమణినెమక
వానరానీకమును బంపి । పలుదెసలకు
మనకు దోడ్పడనెంచును । మహితలీల.

మన మీవానరుల సహాయమున కార్యసిద్ధి బొందగలుగుదుమని తోచుచున్నది. వాలింజంపుటవలన నపవాద మేమయిన వచ్చునేమో యని మాత్ర మాలోచింపుచున్నాను (ఆలోచించి) అయిన నందుదోష మేమియును లేదు.

తే. గీ. పరులవిత్తము హరియించు । వాని పరుల
దారల గ్రహించువానిని । దండనంబు
సేయకుండుట దోషంబు । క్షితితలేంద్రు
పట్లకానఁ గూల్పఁగవచ్చు । వాలినిపుడు.

లక్ష్మ—నిశ్చయము.

శ్రీరా—ఇంకమనమరిగి కాలోచితకృత్యములు దీర్చికొని వాలి సుగ్రీవుల బోరాటంబును కెదురుచూచుచుందము.

(నిష్క్రమింతురు.)

రంగము:—కిష్కింధ.

[మందిరమున, వాలి, తార, పరివేశము.]

వాలి—(తారను జూచి) రమణీమణీ! ఏమికారణమోగాని మూఁడు నాలుగు దినములనుండి సుగ్రీవుని యనుచరులు విచ్చలవిడిగాఁ జరింపుచున్నారు సుమా. ఏమిధైర్యమో మాత్రము నాకుఁ దెలియకున్నది.

తార—సుగ్రీవుని కడ కెవ్వరో యిరువురు రాజకుమారులు వచ్చినారఁట! వారుండిరని ధైర్యముచేత కాఁబోలు!

వాలి—వారు సుగ్రీవున కేమి సేయుదురు?

తార—మీపై కెత్తి వచ్చుటకు భానుసుతునకు సహాయము సేయుదురేమో.

వాలి—అది కేవలము వెఱ్ఱిమాట. రక్షోనాయకుండైన రావణుండే నాబాహువులమధ్యఁ జిక్కి నాతో సఖ్యంబు జేసికొనెఁవాఁడు. అట్టిచో వీరెంత?

తార—ఏపుట్టలో నేపామున్నదో యెవ్వ రెఱుంగుదురు?

వాలి—సుదతీ! పతిబలము నెఱింగియుండియు నిట్లు పల్కుచున్నావు.

మ. చతురంభోధి పరీతమైన ధరణీ చక్రింబునంగల్గు భూ
పతులేకాదు సమస్తలోకములు నాపైనెత్తిరానిమ్ము మా
యతశాహాబల దర్పమేర్పడగ దున్మాడంగనే జాలనే
మతియందిట్లు దలంపగాఁ దగునె భామాశంక నీకేటికిన్.

[తెఱలో]

ఓహో! నీవంతటివాడవే యగుదువు. కానిమ్ము. ఇంతవఱకును కాలమునకోర్చి నిన్నుఁ గూల్పక వేచియుంటిని. ఇఁక నిన్ను క్షమించువాఁడనుగాను.

తే. గీ. భార్యనపహరించినయట్టి - పాపమతివి
యగ్రజుండని చెప్ప సి - గ్గౌనునాకు
తులువ! యాజికేతెంచి నీ - దోర్బలంబు
జూపుమీ యిఁకనిన్నును - సొక్కజేతు.

వాలి—(విని) ఏమిదీ! పడతీ! వింటివా! సుగ్రీవుని వాక్యములు. నిన్న మొన్నటిదాక నాచేదెబ్బలు తినితిని భయముచేత ఋష్యమూకంబు ప్రవేశించి, నేటికి మరల దర్పమేర్చి నాపైకెత్తి వచ్చి నన్నా రణమున కాహ్వానింపుచున్నాడు. కానిమ్ము. ఈసారి వీనిందప్పక తుదముట్టించెదను. సతీమణీ! సుగ్రీవుఁడు రణమున కాహ్వానింపుచుండెను కావున నేఁబోయి విజయలక్ష్మి లాలితుండనై సత్వరమున నరుదెంచెదను.

తార—మీరామాట జెప్పినంతనే నాకు భయమగుచున్నది. నేనెన్నఁడును మిమ్ము దేనికిని నభ్యంతరపెట్టలేదు కాని యీసారిమాత్రము సుగ్రీవునితో రణముచేయుటకు మిమ్ములను బంపుటకు నాచిత్తంబు సమ్మతింపకయున్నది.

తే. గీ. రవికులాంభోధి చంద్రుండు - రామచంద్రు
డనుజుతోడను సుగ్రీవు - నండఁజేర
వారిబలమును నమ్మియే - భానుసుతుఁడు
బిలచె నాజికిమిమ్ముల - వేడ్కతోడ.

కాకున్న నింతటి ధైర్యమెచ్చటనుండి వచ్చును? ఆరామలక్ష్మణు లద్వితీయపరాక్రమవంతులని వినియున్నదాన. కావున మీరిప్పుడు రణమున కేగవలదు.

వాలి.—ఆరామలక్ష్మణు లేమిషమీఁదనో యిట్లు వచ్చియుండురు గాని సుగ్రీవునకు సాయముచేయుటకు మాత్రముగాదు. రవికులీనులు నిరంతర ధర్మవ్రతాచార పారీణులనియు, సత్యసంధులనియు

౦నియుంటిని. అట్టియెడల నెన్నడును నేవిధమైన యపకారమును జేసి యుండని నాపైకి వారేలకయ్యమునకు వత్తురు? వారుమాత్రము మం చిచెడ్డలు విచారింపరా! నీవట్లున్నటికిని దలంపవలదు.

తార—మీరట్లన్న నేనేమనఁగలను. ఎన్నడును లేనిభయము నాకిప్పుడు గలుగుచున్నది లేకున్నచో మీతోనింతగా చెప్పుదునా! నేటిదినమున సుగ్రీవుని గంభీరధ్వని వినినంతనే నాగుండెలు తల్లడిల్లినవి. కావున నాప్రార్థన మంగీకరించి నేటికి సుగ్రీవునితో రణముసేయుటకు బోవలదు.

## 6 అనుబంధము.

వాలి—తరుణీ! స్త్రీలు పిటికి వారనుమాట సత్యము జేసితివి. నీకేమియు భయములేదు. ఇఁక నాకనుజ్ఞనిమ్ము?

తే. గీ. నాకు జడిసి యేమూలనో నక్కియుండి
నేటికే తెంచె మరల నానీరజాప్త
తనయుం డనిసేయవాని దోర్దర్పమడచి
విజయలక్ష్మిని గైకొని వేడ్కతోడ
నేగుదెంచినప్పుడు గౌఁగిలిమ్ముతరుణీ.

నేనిదే పోవుచున్నాఁడ. (నిష్క్రమించును.)

తార—(తనలో) నాకేమోగాని నేనుమిగుల భీతిజనింపుచున్నది. గానిమ్ము. భగవంతుఁడున్నాఁడు.

(నిష్క్రమించుచున్నది)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# లంకాదహనము.

(సీతాన్వేషణము.)




## తృతీయాంకము.

రంగము:—గిరిప్రదేశము.

[రామలక్ష్మణులు ప్రవేశము.]

7 అనుబంధము.

శ్రీరా—(సీతనుద్దేశించి) హా! సతీశిరోమణీ! పూర్వజన్మమున నందేదంపతుల నెడబాపి నవ్వితినో యాపాపఫలంబిప్పు డనుభవింపు చుంటినిగదా! నిన్ను బాసిననాటనుండియు నిద్రాహారములు లేక ఒక్కతీరుగ బరితపించుచుంటి. మహాధైర్యచిత్తుడనగు నేనేయిట్లు సంతాపము నుబొందుచుండ నబలవగు నీవు రాక్షసునిచే నపహరింపబడి, వ్యాకులమెంతగాజింతింపుచుంటివోకదా!

ఉ. హారమణీమణి! జనకజాత్మజ! పద్మవిశాలనేత్రి యా
హారమణీయ విగ్రహ గుణాకరి సాధుచరిత్రి సాధ్వి శం
పారుచిరాంగి! సీత! నినుబాసి చరింపుచున్న వాడ రా
వే శరణార్థి నన్ గృపను వేగనవే పరితాపమార్పవే.

ఆనాడరణ్యంబున మాయమృగంబు మమ్మలనింత దుర్దశకుదెచ్చినది.

తే. గీ. ఆశ్రమంబునమేము లేనట్టిజాడ
నరసి లంకాధినాయకుండరుగుదెంచి

మాయచేతను నిన్నుఁ గొంకే పోయెగాక
నేనెయుండినఁ దరమౌనె నీరజాక్షి.

అక్కటా! సుదతీ! ఆరాక్షసునిచేఁ జిక్కి యెట్టియిక్కట్లఁబడు చుంటివోకదా! ఆనాఁడు రాక్షసుఁడు నిన్ను దనరథంబుపైఁ బెట్టుకొని పోవునప్పుడు విడిపింపుమని నన్నుగూర్చి యెంత విలపించితివోకదా! నీవనినవాక్యములు జటాయువుచే వినియు, హృదయము వ్రయ్యలవక యున్నది. (రావణునుద్దేశించి) ఓరీ! రావణా! దైత్యకులపాంసనా! మాయచేసి యబలను గొనిపోవుట యదియేటి శౌర్యము? సత్వరము గనే మదీయ నిశితాస్త్రములు నిన్ను పుత్రమిత్రామాత్య భృత్యవర్గం బుతో గూడ యమపురికి బంపును. చేటుకాల మాసన్నమగుటచేతనే యిట్టి దుష్కార్యము గావించినావు. కానిమ్ము జగంబుననింక నెన్నాళ్ళు మహాబలవంతుఁడనని గర్వించెదవు?

లక్ష్మ—(తనలో) హా! విరించీ! రఘుకులరత్నంబగు రామచంద్రున కెట్టిసంతాపంబును గలుగ జేసితివి! ఈతఁడు నీయెడలనేమి మహాపకార మాచరించినాఁడు? సీతావియోగమునకై చింతించునీతని నెట్లూరడింపగలను! (ప్రకాశముగా) అన్నా! రామభద్రా! నీవు వచించినట్లు సత్వరముగనే నీశరంబులు రావణునిఁ దెగటార్పగలవు. వానికి వినాశకాలము సమీపించుటచేతనే యిట్టి ద్రోహమాచరించినాఁడు.

శ్రీరా—తమ్ముడా! కర్మఫలంబును ప్రతివాడును ననుభవించి తీఱవలయును. సరే. నాచింత సీత నాకనులముందు పడువఱకునుఁ బోవునది కాదు. (ఇంచుక యూరకుండి) ఇదివఱకే మనము కాలయాపన మొనర్చితిమి. ఇకనైన సీతాన్వేషణమును, రావణ వధోద్యోగం బును బూనవలయును అన్నట్లు మఱినితిని సుగ్రీవుని యభీష్టముదీర్పఁ దలంచి వాలిని గెలిచి యాతనిని గిష్కింధ కభిషిక్తుని జేసితిమి.

సీతాన్వేషణ మాచరించుట కియ్యది వర్షాకాలమగుటచే మనల నిక్కడనుండమనియు, వర్షాకాలము దీఱినవెంటనే నాకడ కరుదెంచి సీతజాడల నరయుప్రయత్నము సేయుదుననియుఁ బలికి యింతవఱకును రాలే దేమికారణమో నేనూహింపఁజాలక యున్నాను.

లక్ష్మ—ఆయాదిక్కులయందుండు వానరులను సీతాన్వేషణ మాచరించుటకుఁ దోడ్కొనివచ్చుటకు నరిగియుండెనేమో యని తలంచెదను. కాకున్నచో మనమాతనికి చేసిన ప్రత్యుపకారమును మఱచునా! అతఁడంత కృతఘ్నుఁడా! అయినను బరులహృదయంబు లగోచరంబులు.

శ్రీరా—(ఎదుటజూచి) అదుగో యెవ్వఁడో వానరుఁడు కాబోలునిట్లు వచ్చుచున్నాఁడు. వానింగనుఁగొన్న సుగ్రీవుని వార్త తెలియగలదు. వాని నిటకుఁ దోడ్కొనిరమ్ము.

లక్ష్మ—(నిష్క్రమించి వెంటనే వానరునితో బ్రవేసించును.)

వాన—(రాముని జూచి) దేవా! రామచంద్రా! వందనములు.

శ్రీరా—ఓయీ! వానరా! సుగ్రీవుఁడు పురంబునందున్నవాఁడా?

వాన—దేవా! ఆతఁడు పురంబువిడిచి యెక్కడకుబోవును? నూతన రాజ్యలక్ష్మి యాతనిని వరించినదికదా. దానికేమి. దానితోబాటు తారకూడ లభించుటజేసి కాముకవ్యాపారలోలుడై, రాచ కార్యముల సహితము మఱచి మందిరమువిడిచి యివతలకు వచ్చుటయే లేదు.

శ్రీరా—అవును. అంగనాసక్తచిత్తులకు ధర్మాధర్మములు తెలియవుగదా! పాపము నీవు ఫలాహారణార్థమై వచ్చితివని తోచినది. నీవు పోయిరమ్ము.

వాన — చిత్తము. (ఇవతలకు వచ్చి తనలో) సుగ్రీవుడు రాము ల చేత దనకార్యము జేయించుకొని, యాతనికార్యము చేయుటయందు శ్రద్ధ వహించినాఁడు. వీరలిగితి రేని యాతనికేఁగూడ వాలిగతిపట్టుట యే నిశ్చయము.

(నిష్క్రమించును)

శ్రీరా — తమ్ముఁడా! వింటివా! ఇప్పుడు సుగ్రీవుని వ్యాపార మెట్లున్నదో!

తే. గీ. భార్యనపహరించిన యట్టి వాలిఁగూల్చి
భార్య నొసగిచేసితిరాజు భానుసుతుని
కాని వాఁడుకృతఘ్నుఁడై కార్యములను
మఱచి యుండెనుకాబోలు మనదుపట్ల.

ఉపకార మాచరించినవారికి యపకారము వెంటవచ్చుననుటసత్యమే.

లక్ష్మ — సుగ్రీవుఁడు మనయెడల నిట్లశ్రద్ధ వహించి యుండు నని నేనెన్నఁడును దలంపలేదు.

శ్రీరా — మోహాంధకార నిమగ్నులయినవారికి యుక్తాయుక్త విచారణముండునా? ఇంతకును లోకైక వీరుండగు వాలినిజంపికిష్కింధవీనికిచ్చుటచేతనే గర్వాంధకార ప్రమత్తహృదయుఁడై యుండెను. వానిపని దీఱెఁదికదా. మనపనితీఱిననేమి తీఱకున్ననేమి? అదియంత యువాని కేల. ఆఁడేమో మనకు మహోపకార మాచరించునని వర్షాకాలమంతయు నిచ్చుటయుంటిమి. కాలమంతయు గడచిపోయినది. ఇంక మనమైన నేదేని యుపాయమాలోచింపవలయును.

లక్ష్మ — భానుజుఁడు రాకుండునా!

శ్రీరా — వచ్చినను రాకయుండినను నాతఁడేమి సేయఁగలఁడు?

గీ. స్త్రీలయందునఁ జిత్తంబు జేర్చినాఁడు
పానమందు నాసక్తితో వరలుచుండె

నట్టిసుగ్రీవు డియ్యెడ | కరుగుదెంచు
గాక స్థిరచిత్తమున నుండఁ | గలఁడె చెపుము.

ఇంకా నాసంగతిగూర్చి విచారింతము. కాంతామణియందున్న బెంగచేఁ గృశించితిని. నీవానాకు సేవలు చేసిచేసి డస్సియుంటివి. ఇందులో నెవ్వరుకార్యమును దీర్పఁగలరు? మరే. వట్టియాస. ఏనాడు సీత నన్నెడబాసినదో యానాడే నేను వ్యర్థుఁడనైతిని. ఇంక నీయాసలన్నియు విడిచి యడవిని దాపసవృత్తినుండుటయే మేలు.

లక్ష్మ—అగ్రజా! నీవు ధైర్యమును గోలుపోవలదు. సుగ్రీవుండు రాకుండినమాత్రమున మనకార్యము జక్కపడకయుండునా! ఎంతవెఱ్ఱిమాట పలికితివి! బ్రహ్మాండభాండము లన్నియు నొక్కపెట్టున భస్మముసేయఁజాలు నీతమ్ముఁడుండగా నీకెట్టికొఱంతయు సంభవింపదు. అన్నయ్యా! నీవింక సందేహింపక నాకనుజ్ఞనిమ్ము,

మ. అనృతంబుల్ వచియించుసూర్యసుతు నే | నాజిందృటింగూల్చి యా
దనుజుల్ రావణసంగరాంగణములో | దర్పంబుదూలించి శ్రీ
జనకక్ష్మాధవపుత్రిదెచ్చియిక నీ | సాన్నిధ్యమందుంచి నె
మ్మనమానందముబొందజేతు రఘురా | మా! రాజకంఠీరవా.

(సుగ్రీవు నుద్దేశించి.) ఓరీ! సుగ్రీవా! కృతఘ్నా!

తే. గీ. వాలిదర్పంబు దూలించి | పట్టభద్రు
జేసె నిన్నును రాముండు | క్షితితలమున
నట్టి యుపకారము మఱచి | యలరునిన్ను
గఱకుఁగత్తిని గంఠంబు | నఱుకువాఁడ.

(పోబోవుచున్నాఁడు.)

శ్రీరా—(లక్ష్మణుని బట్టుకొని) తమ్ముఁడా! ఆగుము. ముందువెనుక లరయకుండ నెట్టికార్యమును మనము సేయఁగూడదు. అందులో ధర్మవర్తనమందు రఘుకులము మిగుల ప్రసిద్ధివహించినది సుగ్రీ

వుడెంత మన కార్యము మఱచి వర్తింపుచున్నను ముందుగా మనము తొందరపడరాదు, కావున నీవరిగి కాలయాపనమైనదని చెప్పి యాసుగ్రీవునిఁ దోడితెమ్ము. ఆతఁడునిరాకరించెనేని పైమాటచూచుకొందము.

లక్ష్మ—అన్నయ్యా! మనకుపకారము జేసిన వారియెడఁలగూడ నీహృదయము నవనీతమయమై యుండును. కృతఘ్నులను దండించుట దోషముకాదు. కామాంధకార నిమగ్నుడైమన యుపకారమును మఱచి వర్తించు యాసుగ్రీవుఁడు దండనార్హుఁడు. ఆతనిని వధించి యంగదుని రాజుగా చేయుదము. అతనివలన మనకార్యములు నెఱవేఱును.

శ్రీరా—తమ్ముఁడా! తొందర యెప్పుడును ధీరపురుషులకు పనికిరాదు. కావున నాయాజ్ఞ నతిక్రమింపక నీవు కడురయంబున సుగ్రీవుని కడకరిగి, యిదియంతయు దెలిపి నాకడకుఁ దోడ్కొనిరమ్ము ఒకవేళ నాతఁడు మదాజ్ఞ నిరాకరించెనేని యాతనితో నావచనంబులుగా నిట్లు చెప్పుము.

చం. దినకరపుత్రికుండవు సు ॥ ధీవరనీవుతలంప; నేనునున్
దినకరవంశ జాతుడను ॥ తేజమెలర్పగనందుచేత నీ
వనితనుగొన్న వాలిని న ॥ భంగురలీలవధించియా రుమా
వనితను నీకునిచ్చితిని ॥ భవ్యగుణాఢ్యుడవంచు నెంచుచున్.

తే. గీ. తరుణి జిక్కెనటంచును ॥ దలచినాడు
కార్యము మఱచి యారుమా ॥ కాంతతోడ
దగిలి నిరతంబు వర్తింప ॥ దగునెనీకు
నాదు హితమైన బాటించి ॥ నావుకావు.

ఓయీ! గతజల సేతుబంధనములకై విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. ఇప్పుడైనను నేను నీకుఁజేసిన యుపకారమును జ్ఞప్తికితెచ్చుకొని వానరసేనలతోడ నాకడకురమ్ము.

తే. గీ. అట్లు గావింపకున్నచో నతిరయమున
మహిత శాతరములు నీ పైఁగప్పి
వాలి యుండినచోటికి బంపువాఁడ
సందియము లేక చెప్పితి డెందమందు.

లక్ష్మ—ఇంక నేనరిగివచ్చెదను. (నిష్క్రమించును)

రాము—(నిష్క్రమించును.)



రంగము—కిష్కింధ.

[సౌధమున సుగ్రీవుండు, రుమ ప్రవేశము]

రుమ—ప్రాణేశ్వరా!

తే. గీ. సంపదలఁబాసివారికి జడసి కొండ
గుహల యందుననుంటిరి కువలయాక్షు
నైన నన్నును బాయంగ నగునె మీకు
జూడగంటి నిన్నాళ్ళకు శుభచరిత్ర.

ఆవాలిపెట్టినపాట్లు చెప్పుకొన్నచోఁ గుండెలువ్రయ్యలగును. తన్నుఁ గూడుమని యెంతయోనిర్బంధపరచెను. కాని సాధ్వియగు తారయుండుటచే నేనాతనికివశపడలేదు. తారచేసిన మేలునుమఱువరాదు.

సుగ్రీ—మొదటనీయందు నేను దురభిప్రాయపడితినిగాని, నీసుశీలతంగూర్చి తారవలనవిని మిగులయానందమందితిని.

రుమ—దేవా! ఎన్ని చిక్కులుపడుచున్నను మీదివ్య పదారవింద సేవచేయు భాగ్యమెన్నటికైన లభింపకయుండునాయను నాశవహించి శరీరంబునఁ బ్రాణంబులుధరించియుంటిని.

సుగ్రీ—చెలీ! మనప్రయత్నమువలన నేమియు లాభము లేదు. అంతయు దైవాధీనముగాని మఱియొండు కాదు.

తే. గీ. వాలినోర్వంగజాల \ భయముచేత
ప్రాణములు నిల్పుకోనెంచి \ భావమందు
కొండగుహయందు జేరితి \ కువలయాక్షి
తప్పుమన్నించి బ్రోవంగ \ దగునునీవు.

శ్రీరామమూర్తి యనుగ్రహమున మనమిరువురమును మరలఁ గలిసి కొంటిమి.

[తారప్రవేశము]

తార—(రుమా సుగ్రీవులనుజూచి) ఓహో! దంపతులు రహస్యములాడుకొనుచున్నారు కాబోలు! రావచ్చునో లేదో!

సుగ్రీ—తారా! నీవు దెలియని రహస్యము లేమున్నవి?

రుమ—అక్కా! రమ్ము.

తార—నేనువచ్చుట కేమిలే. ఎప్పుడు సుగ్రీవుని విగ్రహము జూడగందునని నీవును, నెప్పుడురుమతోఁ గూడియుందునని సుగ్రీవుండును నట్లొకరికై యొకరుచిరకాలమునుండి వేచియుండి యిప్పటికి గలిసికొంటిరి. పానకంలో పుడకవలె మీయిరువురిమధ్యను నిప్పుడు నేనెందుకు?

[తెఱలో]

ఏమీ! హనుమంతా! పెక్కుదినములనుండియు నీవు సుగ్రీవుని చూచుచుండలేదా! ఇదియేనా సుగ్రీవుని మందిరమునకుదోవ? అట్లయిననీవు గూడయిప్పుడు నావెంటరమ్ము.

(సుగ్రీవునిచూచి)

తార—ఈగంభీర భాషణము లెవ్వరివై యుండునోగదా!

సుగ్రీ—కంఠస్వరమునుబట్టిచూడగా రామానుజుండగు లక్ష్మణునివలెఁ దోచుచున్నది ఏమోగాని నామనమున నించుక భీతికలుగుచున్నది.

[హనుమంతునితో లక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

లక్ష్మ—(హనుమంతునిచూచి) హనుమంతుఁడా!

తే. గీ. మహితగుణుఁడైన రాముని మఱచి రాజు
కార్యములవీడి మతిమాలి కాంతతోడ
దనరుచుండె సుగ్రీవుఁ డతనికి మేము
జేసిన యుపకారమకట వాసివీఱ
పాముకు పాలుపోసిన భంగియయ్యె.

వర్షకాలానంతరమునఁ సీతాన్వేషణమందు వర్తించెదనని చెప్పి యింతవఱకును శ్రీరామసన్నిధికి రాలేదు. ఈతని కృతఘ్నత్వమునకు రాముఁడు దండతాడిత మహోరగంబు కరణి మండిపడుచు నాతని తోఁ గొన్ని వాక్యములు పలికి రమ్మని నన్నియ్యెడకంపినాఁడు. కావున నాతనినిటకు బిలువుము.

హను—(తనలో) ఆహా! ఇప్పుడు సుగ్రీవుఁడేవిధమున జేసి నాఁడు. ఈతఁడు రామలక్ష్మణులయెడల గృతఘ్నుఁడై యుండెనేని వాలికి దటస్థించినగతియే యీతనికి దటస్థించును. (లక్ష్మణునితో) దేవా! ఆతనిని నేనుదోడ్కొని వచ్చెదను. ఇట నిల్వుఁడు.

లక్ష్మ—మంచిది. సత్వరముగ రమ్ము.

హను—(కొంచెము ఇవతలకువచ్చి సుగ్రీవునిజూచిగట్టిగా)—

ఉ. భానుతనూజయిట్లు రఘువర్యుఁడు జేసిన కార్యమంతయున్
మానసమందునన్ మఱచి మానినితోడ చరింపుచుంటివే
మానుగ గోపమూని యిటు మానవనాథుని యాజ్ఞఁబూని వెం
తేసిన జూడ లక్ష్మణుఁడు తెంపునవచ్చెను నేఁగుదెంచుమా.

సుగ్రీ—తారా! వింటివా! హనుమంతుని వాక్యములు. అక్కటా! నేనెంత పొఱబాటొనరించితిని. రాముని కార్యము మఱచి

యంగనాజనులోనుండనై యుంటిని. ఇంక లక్ష్మణుండు నన్ను బ్రదుక నిచ్చునా ! ఆతనికడ కేరీతిబోవగలుగుదును ?

తార—ఆలస్యమును మన్నింపుడని కోరినచో నార్తరక్షణబిరుదాంకితులగు నాయన్నదమ్ము లేమియు నపకారమును సేయరు.

సుగ్రీ—(ఇవతలకువచ్చి హనుమంతునిం జూచి) హనుమంతా! నేను రామునియెడల మహాపరాధం బొనరించితిని. లక్ష్మణుండు కోపావేశముతోడ నుండెను కాబోలు !

హను—రెండవరుద్రుని చందమున వెలుంగుచున్నాండు. కాకున్నచో నీకింతమఱపేల. ఉపకారము జేసిన రామలక్ష్మణులను మఱచి వర్తించుట ధర్మమా ! కానిమ్ము. జరిగినదేమియో జరిగినది. ఇప్పుడైనను వారిని రక్షింపుమని కోరుకొని, రామకార్యంబునందు జాగరూకుండవై వర్తింపుము రమ్ము. (అని సుగ్రీవుని లక్ష్మణునికడకు దోడ్తెచ్చును)

లక్ష్మ—(సుగ్రీవుని జూచి) ఓహో ! సుగ్రీవుండా ! జ్ఞాపకమున్నదా ! నేను రామునితమ్ముండను. లక్ష్మణాభిధానుండను. మేమునీకుం జేసిన యుపకారమునకు దగినట్లు మాకు జేసితివి. కృతఘ్నుత్వమునందు జగమున నీకుసాటి యింకొకడు లేడు.

ఉ. అక్కడ రామమూర్తి జన ♦ కాత్మజగూర్చితపించుచుండ నీ
 విక్కడమోద మేర్పడగ ♦ నింతులతోడమెలంగుచుంటి వే
 నిక్కముగాగ రామధర ♦ ణీపతి మేలును మర్చియున్నచో
 దక్కనె నీదుప్రాణములు ♦ ధర్మచరిత్రుడనైన నే నిర్కా.

నీవు బుద్ధిమంతుండవని తలంచి రాముండు నీవైరియగు వాలింజంపి రాజ్యము నీకొసంగినాండు. ఇప్పుడిదియంతయు నేల ? రాముండు నీతో నిట్లుచెప్పమనెను.

చం. దినకరపుత్రకుండవు సు ♦ ధీవర నీవుతలంప నేనునుర్కా
 దినకరవంశ జాతకుడను ♦ దేజమెలర్పగ నందుచేత నీ

వనితను గొన్నవాలిని స ॥ భంగురలీలవధించి యారుమా
వనితను నీకునిచ్చితిని ॥ భవ్యగుణాఢ్యుడవంచు నెంచుమర్కా.

తే. గీ. తరుణిచిక్కి నటంచును ॥ దలచినాదు
కార్యము మఱచి యారుమా ॥ కాంతతోడ
దగిలి నిరంతరంబువర్తింపఁ ॥ దగునెనీకు
నాదుహితమైన బాటించి ॥ నావుకావు.

ఓయీ ! గతజలసేతుబంధమునకై విచారించిన లాభములేదు. ఇప్పుడైనను నేను నీకుఁజేసిన యుపకారమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని వానర సేనలతో నాకడకురమ్ము.

గీ. అట్లుగావింపకున్నచో ॥ నతిరయమున
మహితశాతశరములు నీ ॥ పైనగప్పి
వాలియుండిన చోటికి ॥ బంపువాడ
సందియములేక చెప్పితి ॥ డెందమందు.

8 అనుబంధము.

సుగ్రీ—(లక్ష్మణునకు నమస్కరించి) లక్ష్మణా ! ఈయినసూతి యెప్పుడును కృతఘ్నుడుకాడు. నూతన యువతీ సంప్రాప్త గర్వమున నించుక యాలస్యమైనది. క్షమింపుము.

హను—దేవా! ఈతఁడు మన్నింపఁబడదగినవాఁడు.

తార—(లక్ష్మణునిచూచి) లక్ష్మణా ! ఈతనిదోషమును మన్నింపుము. వానరసేనలను రావించుట కీదినంబుననే తగిన వారినిబంపును.

లక్ష్మ—(సుగ్రీవునిచూచి) కానిమ్ము. నీవు సేనాసమన్వితుండవై రామునికడకు సత్వరముగ రావలయును. (హనుమంతునితో హనుమంతా ! రామునికడకుబోయి వత్తము. రమ్ము.

హను—చిత్తము.

లక్ష్మ—(సుగ్రీవునిచూచి) భానుపుత్రా! చెప్పవలసిన వాక్యములన్నియు జెప్పితిని. ఆపైన నీయిచ్చవచ్చిన యట్లుసేయుము.

(హనుమంతునితో నిష్క్రమించును)

తార—చూచితిరా! లక్ష్మణుని యాగ్రహము. ఇప్పుడైనను మీరు సత్వరముగ చారులనుబంపి, కపివీరులను రప్పించి, సీతాన్వేషణోద్యోగమున మెలంగుడు.

సుగ్రీ—ఇంక నేను తత్ప్రయత్నమున నుండెద రండు.

(అందఱును నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.





శ్రీ




# లంకాదహనము.

[సీతాన్వేషణము.]

## చతుర్థాంకము.

[రంగము—గిరియందు శ్రీరామలక్ష్మణులు ప్రవేశము.]

9 అనుబంధము.

శ్రీరా—తమ్ముడా! సుగ్రీవుడు సేనాసమన్వితముగా సత్వరముగనే చనుదెంచెదనని పలికి యింతవరకును రాలేదేమి కారణమోకదా! ఆసమయమున కట్లు నిన్నుఁ బ్రతిమాలుకొనెనేమోగా—మరల నాతఁడు మనకార్యము మఱచి యుండనోపు. కాకున్నచో నాతఁడు జాగుసేయనేల! ఇట్టి గర్వమంతయు నాతనికి మనము దెచ్చిపెట్టినదే.

తే. గీ. అన్నకునుజడిసి గిరిగహ్వరములందు
నున్న సుగ్రీవునకును మహోపకార
మాచరించితి ముదమున నతడు దాని
మఱచె; మానునేగుణములు మర్కటంబు.

ఈపాటికి మనమైనను బ్రయత్నముచేసియున్నచో సీత నరసియుందుము. దానికిఁదగిన పని కావించియేయుందుము.

లక్ష్మ—సుగ్రీవుండు తొలుదొల్త నంగనాసక్తచిత్తంబున మాకార్యము మఱచి ప్రవర్తించెను; కాని మనయెడల గృతఘ్నుఁ

యుండినట్లు తోఁచలేదు. ఆతఁడు సైన్యముల సత్వరముగనే రావించి నీదర్శనంబున కరుదెంచుననీ తారగూడ వచించెను. కావున నాతఁడు సత్వరముగనే వచ్చుననీ నాయభిప్రాయము.

శ్రీరా—కానిమ్ము. ఆముచ్చటగూడ జూతము.

[తెఱలో]

తే. గీ. రామచంద్ర భూపాలుండు ✽ రమ్యగుణుఁడు
భయమునందగబోకుము ✽ భానుపుత్ర
శరణుబొందినయంత ర ✽ క్షణము సేయు
సరగఁజనుదెమ్ము శ్రీరాము ✽ సన్నిధికిని.

లక్ష్మ—అన్నయ్యా! అవి హనుమంతుని మాటలు భయము నందుచున్న సుగ్రీవునకు ధైర్యము జెప్పుచు నాతనిని, నీసన్నిధికి దోడ్కొనివచ్చుచున్నాఁడు. (ఎదుటజూచి) అదుగో! వారిట్లే వచ్చుచున్నారు.

10 అనుబంధము.

[సుగ్రీవ హనుమంతులు ప్రవేశము]

హను—(శ్రీరామునిజూచి)

తే. గీ. రాతినాతిగఁజేయు నీ ✽ రమ్యచరణ
కమలములకు భక్తిని నమ ✽ స్కారములను
జేయుచుంటిని ప్రేమతోఁ ✽ జేకొనుమిదె
రాజమార్తాండ శ్రీరామ ✽ రామరామ.

(నమస్కరించును.)

శ్రీరా—పావనీ! నీకు శుభమగుఁగాక. లెమ్ము.

హను—దేవా! రామచంద్రా!

తే. గీ. రామతోడను దగిలి శ్రీ ✽ రాముకార్య
మాచరించుట యందునే ✽ నాలసించి

నాడ; తప్పుడేరీతి భూ । నాథు మొగము
గాంచగల్గుదు నంచును । మించుభీతి
బొందుకంజాత పుత్రుని । బ్రోవుమయ్య.

ఈతఁడు కాలవశముచేత స్త్రీలోలుఁడై భవత్కార్యము దీర్ఘముగయుంచు జాగుజేసినాఁడు. కాని మఱియొండు కాదు. ఈస్వల్పదోషమును మన్నించి యితనిని రక్షింపుము. సమస్త సేనలను నాయత్తపఱచుట కింతయాలస్యమైనది.

సుగ్రీ—(రాముని పాదములపైఁబడి) మహాత్మా! రామచంద్రా! నాతప్పు మన్నింపుము.

తే. గీ. అలుకమానుము మదిని నా । యందు నీవు
ఈశ్వరము నీదంచు । నెంచి; యెట్టి
యాజ్ఞనిడిన దప్పకచేసి । యలరువాఁడ
రమ్యగుణసాంద్ర శ్రీరఘు । రామచంద్ర.

శ్రీరా—(సుగ్రీవుని లేవనెత్తి) భానుమిత్రా! గతమునకు విచారింపకుము. లెమ్ము. మనమైత్రికెప్పుడును భంగముగలుగదు. ఇప్పుడు నీవు సీతాన్వేషణమునుగూర్చి యొనర్చిన ప్రయత్నము లేవి?

సుగ్రీ—సమస్త ప్రదేశములయందున నున్న వానరవీరులను రావించితిని. పెక్కండ్రనేకదిక్కులకు సీతాన్వేషణమునకై బంపితిని. సుషేణ, వినత, శతబలులను వానరప్రముఖుల నాయాస్థలములకు బంపితిని.

శ్రీరా—ఇఁక నొకదక్షిణ దిక్కుమాత్రము దిగఁబడియున్నది. సుగ్రీవా! లంకాపురాధీశ్వరుండగు రావణుండు సీతనెత్తికొనిపోయెనని మాకు దొరికిన భూషణములను బట్టి తెలియుచున్నదికదా. ఆలంక దక్షిణదిశయందున్నది. కావున నచ్చటికేగుటకు జవసత్వంబులు గలిగి

దనుజులమాయల నెఱిఁగిన వానరవీరులను బంపవలయును. ఇందుల నుగూర్చి యాలోచింపుము.

హను—(సంతోషముతో) రామచంద్రా! రఘుకులసాంద్రా! నేనాపైపునకుబోయి జగన్మాతయగు సీతనువెదకి యామె సేమంబు నీకుఁదెలిపెదను.

ఉ. వారిధియడ్డమైనను స ♦ పర్వవిరోధులు నడ్డగించినన్
ధీరత లంకఁజొచ్చి కడు ♦ దెంపును బెంపువహించి యప్పురిన్
సారసలోచనన్ జనక ♦ జాతనునారసివచ్చెదన్ దృటిన్
శ్రీరఘురామచంద్ర నృప ♦ శేఖర నాకుననుజ్ఞనీయుమా.

చం. దనుజులమాయలన్నియును ♦ దప్పకయారయువాఁడ జానకీ
వనితను జూచువాఁడ బల ♦ వంతులదైత్యుల గూల్చువాఁడ మా
జనసిశుభంబు నీకుఁ గడు ♦ సంతసమేర్పడజెప్పువాఁడ; నీ
మనము ముదంబు నందగను ♦ మానకజేసెద నన్నుబంపుమీ.

దేవా! నీకృపావిశేషంబున జతుర్దశ భువనంబులును నవసరమ య్యేనేని తిరిగి జగన్మాతయగు సీతామహాదేవిని శోధించి యామెసే మంబు మీకెఱింగించెద. ఇంతియేగాక లంకయందున దానవులను బలాబలంబులును మొదలగు రహస్యములన్నియు గనుఁగొనివచ్చెద. నాకనుజ్ఞనిమ్ము.

శ్రీరా—(తనలో) ఈహనుమంతుఁడు సామాన్యుడుకాడు. ఈ శ్వరప్రసాద సంజనితుడు. సకలశాస్త్ర విద్యాపారంగతుఁడు. నవవ్యా కరణవేత్త. భవిష్యద్బ్రహ్మ. అసమాన బలపరాక్రమవంతుఁడు. ఈత నివలన గార్యము జక్కవడును.

సుగ్రీ—(రామునిజూచి) దేవా! హనుమంతు నిక్కార్యమునం దు నియోగింపుట మంచిదని నాయభిప్రాయము. మఱ్ఱియుహాకును

తెలియని మాయలు లేవు. అందులో గామయూపి. ఈతనికి సాధ్యము గాని పని యొక్కటియు లేదు.

శ్రీరా. — మంచిది. నాకును నట్లే తోచుచున్నది.

హను——కృతార్థుఁడనగుదును. రామా! శీఘ్రముగా ననుజ్ఞ యిమ్ము. సీతామహాదేవి నన్వేషించుటకు నాచిత్తము తత్తరమందు చున్నది.

చం. దనుజపురంబుఁజొచ్చి యట ॥ దానవవీథుల నుక్కడంచి శ్రీ
జనకజగాంచి మోదమున ॥ సన్నుతిజూపిన నామొ, వీపుపై
ఘనముగ నిల్పుకొంచు త్రిజ ॥ గంబులు మెచ్చెడురీతి దెచ్చి నీ
మనముననింతు మోదమును ॥ మానవనాధ కులాబ్ధిచంద్రమా.

(గంతులు వైచును)

శ్రీరా——హనుమా! నీవంతటివాడవే యగుదువు. ఇక్కార్యము ను నీభుజస్కంధమునందుఁ బెట్టుచుంటిని. నెలదినంబుల గడువులో నీవు రావలయును.

తే. గీ. కార్యభారము నీయందు ॥ గ్రాలియుండె
నెట్లు నిర్వహించెదవో యిం ॥ కెట్లు దేవ
తారిపురిఁజొచ్చి జానకి ॥ నరయగలవో
ముదము నేరీతి గల్గజే ॥ యుదువో నాకు.

నీవు లంకాపురంబు బ్రవేశించి సీతనుగాంచి మాయచే దనుజ బలముల సంగతిమాత్రమే యెఱింగిరమ్ము. ఒంటరివగు నీవచ్చుట నీప రాక్రము జూపఁదలంపకుము. ఒకవేళ సీత నిన్ను నమ్మునో నమ్మదో కావున నాయుంగర మానవాలుగా జూపుము. (యుంగరమిచ్చును)

హను——(అందుకొని కన్నుల నద్దుకొని) మహాప్రసాదము దేవా! లంకాపురమున నవసరమైనచో దైత్యులను బాధించుటకనుజ్ఞ యిమ్ము.

శ్రీరా—అయ్యది యవసరమునుబట్టి నీవు యోచింపుము.

సుగ్రీ—హనుమంతా! నీవెంట నంగద జాంబవంతాదులుగూడ సహాయముగా రాగలరు. వారలనుగూడఁ దోడ్కొనిపొమ్ము.

హను—మంచిది. (రామునిజూచి) దేవా! అనుజ్ఞనిమ్ము.

శ్రీరా—హనుమంతా! లంకఁజొచ్చినప్పుడు నీవు రావణుని జూడకుండ రావని నాయభిప్రాయము. అతనిని నీవు జూచినప్పుడు నావచనంబులుగా నిట్లు పలుకుము.

హను—దేవా! ఎట్లు?

శ్రీరా—ఇట్లు,

చం. వనమునునుండు నట్టితఱి । వంచన మున్ముల జేసి జానకిన్
గొనిజనఁజాలితీవు కడు । కొంచెతనమ్మున నిప్పుడైననున్
మనమున దప్పుదిద్దుకొని । మానసుత దెచ్చి యొసంగు గానిచో
రణమున సుగ్రీవాయక ప । రంపరలన్ నినుగూల్చిపుచ్చి నా
వనితను గొంచుబోయెద న । వారితవిక్రమశౌర్య మేర్పడన్.

(ఇంచుకయూరకుండి) హనుమంతా! రావణున కెట్టివిధంబున బుద్ధి చెప్పవలయునో సకలమును నీకే తెలిపియున్నది. మఱియు సీతతో నిట్లు చెప్పుము.

తే. గీ. దైత్యుచేఁ జిక్కి తనుచు జి । త్తమ్మునందు
భయమునందంగ బోకుమీ । పడతిమిన్న
కొలఁదిదినములు తాళుము । లలితగతిని
వచ్చి లంకాధినాథు ద । ర్పంబడంతు.

హను—చిత్తము. (సుగ్రీవునిచూచి) సుగ్రీవా! పోయివచ్చెదను. అరుగో జాంబవదాదులుకూడ ప్రయాణసంసిద్ధులై నాకొఱకెదురు చూచుచున్నారు.

సుగ్రీ—పోయిరమ్ము. శుభమగుగాక.

11 అనుబంధము.

హను—జయమ్ రఘునందన!

(గంతులు వైచుచు నిష్క్రమించును)

శ్రీరా—సుగ్రీవా! రమ్ము.

(అందఱును నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.





శ్రీ

# లంకాదహనము.

## [సీతాన్వేషణము]

### పంచమాంకము.

[లంకాపురము :—హనుమంతుడు—ప్రవేశము]

12 అనుబంధము.

హను—(తనలో)సముద్రమున కవ్వలియొడ్డున జాంబవదాదుల నిలిపివచ్చితిని. ఆస్వయంప్రభ కృపచేతను, సంపాతికటాక్షము చేతను, లంకాపురమార్గము గనుఁగొనఁజాలితిని. నాకువిఘ్నముగలిగింపఁదలంచివచ్చిన సింహికయు, సురసయను నామంబుల నొప్పునానిశాటుల నోర్చితిని. ఇప్పటికీలంకఁ జేరుకొంటిని. ఆహా! ఏమి ఈపురముయొక్క వైభవము! దేవతానగరముగూడ యింత మహావైభవముగానుండునని నాకుఁదోచదు. సర్వలోక భయంకరుండగు రావణుండు ప్రపంచమున నున్న చక్రములనన్నిటినిదెచ్చి తనపురంబున నిల్పినాడని యూహింపవలసియున్నది. ఈకోటలయందము. ఈబురుజులసొంపు. ఈప్రాకారములగట్టితనము. ఈయగడ్తలయొక్క పెంపు. ఈగకైనను నిందు ప్రవేశించుట కసాధ్యముగదా. రామనామచింతనముచే సముద్రలంఘన మిట్లే యొనరించి యిందుఁ బ్రవేశించితిని. అన్యులు ప్రవేశించుటకు నిశ్చయముగా నసాధ్యమే. అదిగో చీకటిపడుచున్నది. పురము ప్రవేశించుట కిదియే తగినసమయము.

తే. గీ. నాకులమువాఁడు శ్రీరఘు నాథుదూత
మైయరుగుదెంచె వాయుజుం డంచునెంచి
నాకు సాయంబుసేయంగ లోకనాథు
డైనకంజాప్తు డల్లదే యస్తమించె.

ఇంక నేను పురంబులోఁ బ్రవేశించి సీతజాడల నారసెదఁగాక! (నడచుచున్నాఁడు)

[లంకిణియను రాక్షసి ప్రవేశించును.]

లంకి—(హనుమంతునిఁజూచి యట్టహాసముసేయుచు) ఎవ్వడవురా నీవు. మద్భుజబలపరిరక్షితంబైన యీలంకానగరంబును సద్దుసేయకుండఁ మెల్లగాఁ జొచ్చుచుంటివి. నిలువుము. నిన్నిప్పుడే నాకాహారముఁ జేసికొందును.

(మార్గమున కడ్డువచ్చును.)

హను—(తనలో) ఏమిదీ! ఈభయంకరాకారము. ఇయ్యది లంకాపురము రక్షింపుచుండును కాబోలు! ఇప్పుడేమిసేయుదును? దీనియార్భటములు దనుజులు వినిరేని నాప్రయత్నము విఫలమగును. నెమ్మదిగా మాటలాడి దాటనెంచెదను (ప్రకాశముగా) నీవెవ్వరవు? నీపేరేమి?

లంకి—నాపేరు లంకిణియందురు. నేను పురము రావణుని యాజ్ఞఁబూని నిరంతరమును రక్షింపుచుందును. నాయాజ్ఞలేనిదే యెవ్వరును నిందుఁ బ్రవేశింప సాహసింపరు. నీవేల యిందువచ్చితివి?

హను—నేనొక వానరుండను. లంకాపురవైచిత్ర్యసందర్శనకుతూహలాయత్తచిత్తమున నరుదెంచితిని. అనుజ్ఞనిచ్చితివేని యించుక కాలము పురియంగలి చిత్రములన్నియుజూచి మరలిపోయెదను.

లంకి—మర్కటచేష్టలన్నిట్టివే. నీవేడ నగరచిత్రముల జూచుటెడ? పొమ్ము పొమ్ము.

హను—నేను నిన్ను వినయపూర్వకముగా బ్రార్థింపుచుంటిని. నన్ను బోనిమ్ము?

లంకి—వలనుపడను.

హను—అట్లనా (నడుచును).

లంకి— ఏమిదీ! ఈసాహసము! నిన్ను మ్రింగినేసెదను. (పట్టుకొనును)

హను—నీతరముగాదు. (గుద్దును)

లంకి—(ముష్టిచే మఱలబొడుచును)

హను—ఈదెబ్బతో నీవు చచ్చెదవు.

(గుద్దుచున్నాఁడు)

లంకి—వానరా! నన్నువిడువుము. స్త్రీని వధించరాదు. పురిలోని కరిగి నీయిచ్ఛవచ్చినయట్లు విహరింపుము. వానరుని ముష్టిఘాతము నాకుతగిలినప్పుడు లంకకు వినాశకాలము ప్రాప్తించునని మున్ను విరించి నాకుఁజెప్పి యున్నాఁడు. కాలమెవ్వరు దప్పింపఁగలరు! పోయిరమ్ము.

(నిష్క్రమించును)

హను—ఇక్కడికి దీనిగర్వమడంగినది. నేనిక లంకాపురమున గల సకలప్రదేశములు నరసెదగాక! (నడచి) ఇదిగో! ఇవియన్నియు రాక్షసుల మందిరములు. ఇందు ముందు సూక్ష్మరూపినై శోధించెదను (మందిరములందుఁ బ్రవేశించి) ఇందెందును సీత గానుపించలేదు. అదిగో! ది వ్య ర త్న ప్ర భా భా సమానమై యనేక రాక్షసభట పరివేష్టితమై యొక్కదివ్యసౌధము రాజిల్లుచున్నది. అది రావణుని సౌధముగానోపు. ఒకవేళ రావణుండామె నందుదాచి యుంచెనేమో! అరసెదను గాక. (సౌధంబునుబ్రవేశించి) ఆహా! ఏమిదీ! ఈదనుజస్త్రీలు మదిరాపానమత్తచిత్తులై కొందఱు

వివస్త్రలై శయనించియున్నారు. కొందఱు దేహములు తెలియ శయ్యలను విడిచియున్నారు. కొందఱొకరినొకరు కౌఁగలించుకొని శయనించియున్నారు. (ఇంచుకయూరకొని) బ్రహ్మచర్య వ్రతాదీక్షారతుఁడనగు నేను యిట్టివన్నియుఁ జూచి మహాపాపంబు గట్టికొంటిగదా. (ఆలోచించి) కాదు. కాదు. నామానసము నిశ్చలమైనది. రాముని దూతనైకదా సీత నరయవచ్చితిని. స్త్రీజనబృంద మధ్యమునగాక యీమె యెచ్చటనుండు. రామునికరుణచే నాకీ పాపము శమించుగాక. (మఱియొక చోటికిబోయి) ఆహా! ఏమి! ఈవైభవము.

తే. గీ. పదిశిరంబులు చేతులు పదియుగల్గి
త్రాచుబుసకొట్టురీతిని దల్పమందు
నొక్కవెలదితో శయనించు చుండెనితఁడె
దశముఖుండంచు మదిలోన దలచువాఁడ.

ఇట్టిమహాభోగము దేవేంద్రునకైనను నుండదు. ఈతఁ క్రూరుండుగాకపోయినచో జతుర్దశభువన పరిపాలకుడుగా నొప్పును. (పరికించి) ఈతని వద్దనున్న పడతి సీతయని తోచుచున్నది. లోచించి) పాపముశమించుగాక,

తే. గీ. రాముదేవేరి గుణశీల రమణుబాసి
వివిధభూషణాంగియగుచు వెలయగలదె
హారనిద్రాదులె యగునే యకటయిట్టి
తలపుతలపోయ భావంబు రగులకున్నె.

ఈమె సీతకాదు. సర్వభువనైకమాతయగు నామెయెడ కురదనుజుండగు రావణుని సజ్జశయనించుటెడ! ఇందెక్కడను సీతగాపించలేదు. (ఆయాస్థలములవెదకి) గజాశ్వశాలలును, నాయుధాగారములును, వెదకితిని కాని పూతచరిత్రయగు నామె యెచ్చటను గడదయ్యె. ఆరావణుడామెను యెచ్చటదాచియుంచెనో, ఏమి సేయుట

దోచకున్నది. ఇంక నెక్కడ వెదకుదును. సీతనుగాంచకుండ నేబో యితినేని రాముండు ననుజూచి హనుమా! సీతకుశలమాయన్న నేనే మన నేర్తును ? సీతజాడ దెలియకపోవుటచే రాముండు గూలియును. అంతట లక్ష్మణుండు కూలును. వీరిరువురివార్తలనువిని భరతశత్రుఘ్నులు గూలుదురు. వారిమరణంబుగాంచి ముగ్గురు తల్లులును మడియుదురు. ఇదియంతయు జూచి సుగ్రీవాంగదులు గూలుదురు. నేనీ యన్వేషణోద్యోగభార మేలపూనితిని ? రఘుకుల కపికులముల నాశమునకే కాబోలు, నేనిప్పుడు సీతజాడనరయక కిష్కింధకుబోయినచో నిట్లుసంభవించును. కావున నేనిచ్చటనే మరణించినచో బాగుండును. (ఆలోచించి) ఛీ! బలవన్మరణము మిగుల పాపముగదా ! (ఎదుటజూచి) అదిగో! ఈప్రక్కనుండి యొకస్త్రీ యార్తరవము వినవచ్చుచున్నది. అది యేమైయుండునో జూచెదగాక. (నడచుచున్నాడు)

[ఉద్యానవనము:—నశోకవనమున రాక్షసస్త్రీ పరివేష్టితయై సీతప్రవేశము]

13 అనుబంధము.

సీత—(తనలో విచారముతో) హా రఘుకులచంద్రా! రామచంద్రా !

తే. గీ. హరిణమునుదెచ్చుటకు మీర • లరుగ నాడు
రావణుడునన్ను వంచించి • రథముపైన
బెట్టుకొని తెచ్చి యిచ్చోట • బెట్టినాడు
కటకటా ఏమిసేతు • నాకర్మగతికి.

అయ్యో! ప్రాణేశ్వరా! నీయిల్లాలనగు నన్నొక్క మృక్కడి రక్కసుండు గొనిపోవ నీవుసహించుట ధర్మమగునా. లక్ష్మణా! నీవు నాడన్నగారి జాడ నరయనవసరములేదని చెప్ప నేనువినక నిన్ను దూషించి పంపితిని తత్ఫలంబనుభవించితిని. ఆక్రోశము నిప్పుడు మ

నంబున బెట్టుకొనక యగ్రజునితోవచ్చి నన్ను రక్షింపుము. (రాముని యుద్దేశించి) నేటికారుమాసములయినది. రావణుడు నాకిడిన గడువు రేపటితోఁ దీఱును. తెల్లవారిన నాతడరుదెంచును. నాగతి యే మగునో ?

హను—(పరివేశించి) ఈమెయే సీతామహాదేవి, అందులకు సందేహము లేదు. ఆనాడు ఋష్యమూకగిరియందు వస్తువులుగట్టి పార వైచిన గుడ్డముూటయు నీమె ధరించిన చీరయు నొక్కవిధమున నున్న వి. ఆహా! ఏమినాభాగ్యము !

తే. గీ. క్ష్మాసుతనుజూచు భాగ్యమ్ము గాంచినాఁడ
మించుముదమును నృపతికి నించువాఁడ
భానుపుత్రుని మెప్పొంది వరలువాఁడ
కలరె నను బోలు ధన్యులు క్ష్మాతలమున.

అక్కటా! ఈమెవాక్యములు నాకు మిగులజాలిని బుట్టించుచు న్నవి. ఆహా! అయోనిజయై పుట్టి జనకరాజునకు గూతురై శ్రీరా మునకు భార్యయై మహాసాధ్వియనఁ జెల్లిన యీసీతకు యరణ్యవాస మును దైత్యపురవాసమును బ్రహ్మవ్రాసిపెట్టెను. ఎవరుచేసికొన. ఖర్మము వారనుభవింపక తప్పదు. (ఇంచుక యాలోచించి) నేనిప్పుడు సూక్ష్మరూపమున నీవృక్షమెక్కి డాగియుండి యీదనుజస్త్రీలు గృహ ములకరిగినతరువాత నీమెతో భాషించెదనుగాక. (వృక్షము నెక్కును)

ఏకజట—(సీతనుజూచి) ఏమేసీతా ! ఎంతపిలచినను మాటాడ వు. రావణుడు వచ్చువేళయైనది. నీమనస్సులో నేమి నిశ్చయించుకొం టివి ? రావణుని యభీష్టము దీర్చుట కంగీకరించెదవా ?

సీత—ఎంతసేపుమాటలాడినను నిట్టిపల్కు లేకదా ! ఏలమీ రుతొందరపడెదరు? శ్రీరామధనురంభోరాసి సత్వరమ్ముగనే లం... పురమును ముంచగలదు.

ఏకజట—నీవింత గర్వించియుంటివేని యీతనిన్ను విష్ణువను ముల్లోక భయంకరుడగు రావణునియెడల నీబీరములు పనికిరావు. ఇంతమొండితనము పనికిరాదు. రావణుని భర్తగా పొందుట సామాన్యమని తలంచితివా యేమి ?

సీత—ఇంక నీవా ప్రసంగమును గట్టిపెట్టుము.

త్రిజట—(నిద్రనుండి తొందరగా లేచి) ఏకజటా ! ఊరుకొనుము. సీతజోలికి బోకుము. నేనొక కలగంటి.

ఏక—నీవెప్పుడును నాకలవచ్చింది యీకలవచ్చింది అని చెప్పుచుయుందువు. ఏమిటాకల ?

త్రిజట—కలయనగా కలగాదు. సీతను వెదకుట కొక కోతివచ్చి సీతనుజూచి లంకాపురమెల్ల దహించి రామునకు సీతవార్తను దెల్పినట్లును, రాముడు వనచరబలముతో లంకకువచ్చి దైత్యనాశనము చేసి సీతను గొనిపోయినట్లును కలగంటిని.

హను—(తనలో) ఈనిశాటిమాత్రము సాధుగుణశీలయైయుండనోపు. ఈమె కలగాంచినట్లు కోతినగు నేనిచ్చటనే యున్నాడనుగదా.

సీత—(తనలో) ఏమికారణమోగాని నాయెడమకన్ను దరుచున్నది.

[తెరలో కలకలము]

హను—(తనలో) అదుగో! రావణుడు కాబోలు వచ్చుచున్నాడు. కానిమ్ము. వాడేమిభాషించునో చూచెదగాక.

ఏక—త్రిజటా ! దానవేంద్రుడు వచ్చుచున్నాడు.

సీత—(తనలో) దురాత్ముడరుదెంచుచున్నాడు. వీడిప్పుడు నన్నేమిసేయునోగదా. నాశరీరము కంపమెత్తుచున్నది. కానిమ్ము. ప్రాణేశ్వరపాదచింతనపరనైన నా కెట్టియుప్పును వాటిల్లకుండునుగాక.

హను—(తనలో) నిశ్చయముగా నీకెట్టి ముప్పునురాదు. అయినను రామదూదయగు హనుమంతు డెదుటనే యున్నాడు.

[రావణుఁడు ప్రవేశించును.]

రావ—(సీతనుజూచి) నేడుతప్పక నాయభీష్టముదీర్చెదవని నీ ముఖకమలము సూచింపుచున్నది.

14. అనుబంధము.

సీత—హా! రఘునందనా! రామచంద్రా!

రావ—ఇంకను నారాముని యేల దలంచెదవు?

తే. గీ. అడవియందున దమ్ముఁడో నాకులలము
దినుచు జరియించురాముని మనమునందు
దలచెదేటికి యాతఁడు దగడునీకు
భర్తగాయుండ నమ్ముమా భాసురాంగి.

ఇంక నారామునిపై భ్రాంతివిడిచి బలపరాక్రమ శౌర్యముల చేత ముల్లోకములను గంపింపజేయు నాయభీష్టముతీర్పుము.

తే. గీ. ఊడిగంబులు సేయింతు నువిదనీకు
దనుజకాంతలచేతను తప్పకుండ
పట్టపుందేవివై నీవు వరలగలవు
నన్నుఁజేబట్టి మించుమా కోమలాంగి.

హను—(తనలో) వీనికివినాశ కాలము ప్రాప్తించినది.

రావ—తే. గీ. రావణునిచేత దేబడ్డ రమణియుట్లు
వనమునందు దుఃఖింపుచు వరలరాదు
నామహితులెల్ల దీనికి నవ్వుచుండిరి
రమ్ముకామినీ నామంది రమ్ముజేర.

అప్పుడు నీవు సకలసౌఖ్యములను బొందఁగలవు. నిన్ను నేను

గాసినెందరఁ జేయుచుంటినని దనుజులందఱును నన్ను నిందింపుచున్నా రు. ఈనిందాభారంబు తొలంగించుకొనుటకు నీకృపదప్ప వేరుమార్గ ములేదు. (ఇంచుకయూరకుండి) పదిమాటల కొక్కమాటమైనను బ త్యుత్తరమీయవేల ? జెప్పుటకు సిగ్గుగానున్నదా ?

హను—(తనలో) సంధిజ్వరపీడితుడిట్లే వాగుచుండును. ఇప్ప ట్లె వీనిశిరంబులు బగులగొట్టిన బాగుండునుగదా అయినను, రామాజ్ఞ లేదు.

రావ— తే. గీ. రాముడరుదెంచునంచును ॥ రామనీవు
భయమునందగాబోకుమీ ॥ భావమందు
వానివలన నొక్కింతయు ॥ భయము లేదు
సంశయింపకనన్ గూడు ॥ సారసాక్షి.

ఇంక నీవీజన్మమున రాముని జూడజాలవు. నానగరంబుబ్రవేశిం చుట కెట్టి వారికిని సాధ్యముగాదు. ఒకవేళవచ్చునేయనితలంతము. అట్లయినమాత్రమేమిభయము ? రణమున నాచే గూలినాడనియే తలం పుము. ఈవిషయమున నీవేమియు సంశయింపవలదు. వచ్చెడివాడేని యీపాటికే వచ్చియుండును. పోయినదేచాలునని యూరకుండె ను. అట్టివానితో నీవేమి కాపురము చేసి సౌఖ్యపడెదవు ?

15 అనుబంధము.

సీత—(తనలో) వీడంతకంతకు కఠినముగాఁ బ్రేలుచున్నాఁడు. వీనితో సంభాషించుట తగదు గాన యీగడ్డిపోచనడ్డమిడి మాటలా డెదను. (గడ్డిపోచనడ్డమువైచి) ఓరీ ! దుర్మదాంధా ! ఏలరానోటికి వ చ్చినట్లు ప్రేలెదవు ? మహాసాధ్వీశిరోమణినగు నేనుభగవత్స్వరూపుం డగుశ్రీరాముని మానసపీఠముననిల్పి స్మరించెదనుగాని నన్యులనామ మునైన దలంపను. కన్నులతో నైనజూడను. నీవు గాఁ‌ముసమీపించు టంజేసి నన్నిట్లు వెక్కిహింసలుపెట్టుచుంటివి. పరదారనగు నన్ను దె

చ్చుట పాపమని నీకు దోచలేదు. స్వవిషయము నీకిట్టిపాటుసంభవించ యున్నచో నీచిత్తమెట్లుండునో! రాముని పరాక్రమవిక్రమంబులు నీవెఱుంగక యిట్లుబల్కుచుంటివి. ఆనాఁడు రాముఁడు లేకుండుటంజేసి నీవు నన్నుదోఁడితెచ్చితివి కాని లేకున్నచో నీవీపాటికియమునివీటికతిథివయ్యే యుందువు. క్రూరుఁడా! నీవుబ్రహ్మకులసంజాతుఁడవు. సమస్తవేదములను శాస్త్రములను జదివితివి. పరదారాపహరణము ధర్మమని రాఁచ్చుట జెప్పబడియున్నది. ? (ఇంచుకయూరకొని) జరిగినదేమోజరిగినది. ఇప్పుడైనను నీవు బ్రదుకదలంచితివేని నన్ను రామునకర్పించి సుఖింపుము.

హను—(తనలో) కుండ బ్రద్దలుగొట్టినట్లీమె యీతనికిప్రత్యుత్తరమిచ్చినది.

రావ—(తనలో) భయముపెట్టిచూచినగాని యీమె నాయభీష్టము దీర్పదు. (ప్రకాశముగా)

16 అనుబంధము.

రాముని పరాక్రమము చెప్పి నన్నుభయపెట్టకుము. అట్టి రాములు పదియారువేలమంది వచ్చినను నన్ను రణమున దాకజాలరు. సామవాక్యములచేత నీమనసు మెత్తపడునేమోయని యూహించితిని. అందులకు నీవంగీకరింపకుంటివి. ఇంక నీయెడల కరుణబూనరాదు. (కౌఁగలించుకొనబోవును.)

సీత—ఓరీ! దూరముగా నుండుము. నీదుండగములుజూచి నిన్ను భస్మముచేయుటకు నాశాపవాక్యములే చాలునుగాని పతియాజ్ఞ లేకపోవుటచే బ్రతికిపోయితివి.

హను—(తనలో) తల్లీ! నీవంతటి సాధ్వివేయగుదువు.

రావ—(తనలో) ఇప్పట్టున నీమెవిషయమై తొందర పడరాదు. ప్రస్తుతమిట్లు చెప్పిపోయెదగాక. (సీతతో) సీతా! ఇంక నీకు రెండు

నెలలు గడువిచ్చితిని. ఈలోపుగ నీయంతట నీవు నన్ను వరియింపక యుంటివేని నీశరీరము దనుజకాంతల కాహారముగాఁ జేసెదను.

(నిష్క్రమించును)

17 అనుబంధము.

సీత—(విచారముతో) ఆహా! ఈదనుజుండు నాయెడల నెంత కఠినత్వము దాల్చినాఁడు. అయ్యో! నేనెట్టి కడగండ్లగుడుచుచు నెంతకాలము జీవింపగలను. ఇంక బ్రాణములు బాసి సుఖించుటయే మేలుగా నాకుదోచుచున్నది. (రాముని యుద్దేశించి) ప్రాణేశ్వరా! రామచంద్రా! నన్నురక్షింప నింతవఱకున్ను రాకైతివి. నావార్త నీకెవ్వరైన తెలిపిరో లేదో. ఇంతవఱకును నీవరుదెంతువేమోయని ప్రాణములు శరీరమునుండి పోకుండ బట్టియుంచితిని. ఇంకజీవించుట కష్టమని తలంచి నీనామస్మరణము గావింపుచు జీవముల బాయుచుంటి. ముందుజన్మమునకును నాకు నీవేభర్తవగుదువుగాక.

హను— (తొందరగా వృక్షమునుండిదిగి)

18 అనుబంధము.

తే. గీ. రామభూనేత దూతనై । రమణినీదు
జాడ లరయంగవచ్చితి । సంతసమున
కేసరికి నాత్మజుండ సు । గ్రీవసఖుఁడ
హనుమదాఖ్యను జగమున । నలరువాఁడ.

సీత—ఓరీ! మాయరావణా! నన్నేల వంచించెదవు? ప్రాణములు బాయనున్నదానితో నేల యీవగాటలు. ఛీ! అవతలకుబొమ్ము.

హను—తల్లీ! నేను నిజముగా రామునిపంపున వచ్చినవాడనే. నన్ను గూర్చి నీవు సందియము నందకుము. నీపాదసాక్షిగ నేను హనుమంతుఁడను. ఇంతవఱకును నేనివృక్షాగ్రమున నుండి రావణుని పలుకులువింటిని. నీదర్శనము సేయుటకు దగినకాలమునకై నిరీక్షించి

యుండి యిప్పుడు నీమ్రోలనిలచితిని. అమ్మా! నన్ను విశ్వసింపుము. నిన్ను రావణుండుగొనివచ్చిన తరువాత, రాముండు లక్ష్మణునితో బర్ణశాలకు వచ్చి నిన్ను గానక మహాదుఃఖ సాగరమున మునిగి భవదన్వేషణార్థమై సకలగిరులను నరణ్యములను నెమకి యెక్కడనుగానక తుదకు గిష్కింధకువచ్చెను. అక్కడ సుగ్రీవుడను ప్లవంగ రాజుతో స్నేహముజేసికొని యాతని యగ్రజుండైన వాలినిగూల్చి వనచరరాజ్యమునకు సుగ్రీవు నభిషిక్తుజేసెను. నిన్నన్వేషించుటకు బెక్కుమంది పులను ననేకదిక్కులకు బంపినాడు. నేనుశ్రీరామకరుణచే సముద్రలంఘనము నాచరించి యిందుబ్రవేశించి రాత్రియంతయు రావణాదుల యంతఃపురముల వెదకి తుదకిక్కడ నిన్నుజూచు భాగ్యముగంటి... శ్రీరాముండాతని తమ్ముడగు లక్ష్మణునితోఁ గుశలముగ నున్నవాఁడు.

సీత—(తనలో) నిశ్చయముగా నితఁడు రామదూతయే. (ప్రకాశముగా) హనుమా! నాకై నీవు మిగులశ్రమపడితివి. నీమేలు నేను మఱవజాలను. నాస్థితియంతయు నీవు కనుగొంటివికదా. ఇదియంతయు నాథునకు దెలుపుభారము నీదైయున్నది.

హను—తల్లీ! రామభూవిభుండిచ్చిన యీనవ్వాలు. (యుంగరమిచ్చును)

సీత—(ఉంగరము నందుకొని కన్నుల నద్దుకొని) ఈయుంగరమునుజూడ రాముని జూచినట్లేయున్నది. ముద్దుటుంగరమా! నాథుని క్షేమవార్తఁ దెలుపవచ్చితివా!

హను—అమ్మా! నీవింకఁ జింతింపవలదు. నేను సత్వరము, బోయి రామున కీవార్త దెలుపుదును. ఆతఁడును సత్వరముగనే కపిబలము లతోఁ జనుదెంచి రావణుని పుత్రామాత్యభృత్యాదివర్గముతోఁ దునిమి నిన్ను దోడ్కొనిపోఁగలఁడు. అంతవఱకును నిర్వోపికబట్టుము. తల్లీ యింక నాకనుజ్ఞయిమ్ము. నేనుసత్వరముగ గిష్కింధ జేరుకొనవలయును.

19 అనుబంధము.

సీత—హనుమా! నాథునితో నావాక్యములుగానిట్లు పలుకుము.

తే. గీ. దశముఖుఁడు రెండుమాసముల్ కే తడవుయిచ్చె
నద్దిదాటిన పిదప న న్నవనియందు
జంపునట గాన వేవచ్చి సంగరమున
వాని జెండాడినన్ను గా పాడనగును.

మరియు లక్ష్మణునితో నేనన్నమాటలను మనంబున బెట్టికొనక రామునితో నేతెంచు మనుము. నాయుంగరము రామున కానవాలుగానిమ్ము.

హను—(అందుకొని) జననీ. సెలవుదీసికొందును. క్షుద్బాధ దీర్చుకొనుట కీవనమున ఫలములుదింపునా?

సీత—దైత్యులేమి సేయుదురో! ఆభయము లేకున్నచో నీ యిష్టము.

హను—ఇంక నేనరిగెదను. రామ శ్రీరామ.

(నిష్క్రమించును)

20 అనుబంధము.

రావణుని సభాభవనము.

[రావణుడు, విభీషణుడు, విప్రజిత్తు, ధూమ్రాక్షు, విరూపాక్షు, మందపాలకులు ప్రవేశము.]

రావ—సభవంకజూచి (ప్రకాశముగా)

21 అనుబంధము

ఆ ఏమి యీఅద్భుతము! సర్వసురాసుర కిన్నరఖేచరగరుడ గంధర్వయక్షపన్నగ నాయకులెల్లరు యుల్లంబున తల్లడబడు నాధాటి విని. యీహీనుండగు వానరుండు సిర్భీతిని యించుకయు గొంకుజంకు

లోకలంకప్రవేశించుటయేగాక పంకముతో రంకెలు వేయుచు వనం బంతయుపాడుజేసి యక్షకుమారునిఁ బింకమడచి వధించినాఁడట.

విప్ర—మహాప్రభూ! బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో నెవ్వరో యొక్కరీ వానరరూపముదాల్చి యిచ్చట కరుదెంచిరని దోచుచున్న యది గాని యీతఁడు నిజముగువానరుఁడుకాఁడు.

ధూమ్రా—దేవా!యీతనివాక్యములునమ్మఁతగినవిప్రలయనిన.

ఉ. వానరుఁడొక్కరుండు నవ లీలగ వార్ధిని దాటివచ్చి; య
మ్మానినిగాంచి యింతయును మానను లేక వనంబుఁజొచ్చియుఁ
దానవులడ్డినఁ దినక ధ్వంసముఁజేయుచు నక్షయుఁ భవ
త్సూనుని జంపినట్టినుఁడి యచ్చెరువెంతయు బుట్టజేసెడిన్.

విరూ—రాక్షసేశ్వరా! యీవానరుని వైఖరింబట్టి చూడఁ భగవదాంశ సంభూతుండని తోచుచున్నయది.

రావ—ధూమ్రాక్ష విరూపాక్ష విప్రజిత్తులారా! ఈసర్వ ప్రపంచమున వెవ్వడైనను సరే నాచేపరాజితులు కాదగిన వారే (ఒకవైపుచూచి) యేమిరా యీయార్భాటములు.

మంద—మహాప్రభో! పాశబద్ధుడైన వానరునింబట్టి కొందరు రాక్షసులు దేవరదర్శనమునకు వచ్చుచున్నారు.

[హనుమంతునితో రాక్షసులు ప్రవేశించుదురు.]

హను—(రావణునిజూచి కండ్లుచికిలించి నవ్వును.)

రాక్ష—దేవా! యీతడే వనభంగము గావించిన వానరుఁడు.

రావ—ఓరీక్రూరవానరా! నీవెవ్వడవు? ఎందుండి యేపనికై యిచ్చటకు వచ్చితివిరా.

హను—(మరల కండ్లుచికిలించును.)

రావ—ఓరీ! నీకోతిచేష్టలుమాని నిజముదెల్పుము లేనిచో యీకరవాలమున.

హను.—ఆఁ యేమేమి నేనా యెవడనా. ఏమిపనిమీఁద వచ్చితినా అట్లయిన చెప్పెదనాలకించెదవా యిది అంతయు తప్పక నీకు చెప్పవలసినదేనా.

రావ.—ఔరా! ఏమిరా నీకండ్లక్రొవ్వు.

హను.—

ఉ. మారుతిపుత్రుఁడ౯ వినుము ♦ మానవనాథుశుభంపనిట్లు నే
తారమణీ శిరోమణినిఁ ♦ దద్దయుగాంచగవచ్చి యామెనిం
పారఁగఁగాంచి వార్తలను ♦ సంచితలీలను దెల్పి వచ్చుచో
గ్రూరులదైత్యులందునిమి ♦ గొంకకభంగము జేసితి౯ వని౯.

అదియునుంగాక నిన్నెట్లయినంజూచు వేడుకతోడనూహించి వనభంగాదికృత్యములు గావించితిని. అందువలననే నిన్ను జూచితిని యింక నీకుజెప్పవలసిన దించుకగలదు చెప్పెదనాలకింపుము. నీవనేక శాస్త్రములు చదివితివి దానివలన నేమిప్రయోజనముకలదు. పరాంగనాహరణులుమహానరకకూపకబున్నంబడుదురని నీ వెఱుంగవా పోనిమ్ము దానికేమిగాని యీమాట వినుము.

తే. గీ. రామ భూపాలు ఘోరశ ♦ రాగ్నిగాలి
శలభగతి మాడిపోవక ♦ సంతసమున
సీత నర్పించి భక్తితో ♦ జేరి యతని
శరణుబొంది జీవింపు రా ♦ క్షసకులేంద్ర.

మరియు,

తే. గీ. రాఘవుండన్న సామాన్య ♦ రాజుగాఁడు
దైత్యవంశాంతకుఁడంచు ♦ దలచి యతని
భార్యనుగొనిపోయి మరల ♦ పరమభక్తి
నతని కర్పించి శరణంబు ♦ నందుమయ్య.

అట్లొనరింపకుందువేని మోసము వాటిల్లును.

రావ—రాముని పరాక్రమము మాచెంత నింతఘనముగా వర్ణింపకుము. ఆతనికి నాకును హస్తిమశకాంతములు. ఔనౌను అంత శౌర్యశాలియగుట వలననే కాబోలు తనభార్యను నాలంకనుంచిన యింతకాలమునకైన నాపై సమరమునకు రాకున్నవాఁడు.

హను—సమయము రావలయునుకదా! త్వరపడిన లాభమేమి ? రాముని మహత్వమించుక జప్తికిందెచ్చుకొనుము.

చం. అనిమొననిన్ను గెల్చి చెఱ ॥ యందున నిల్చినకార్తవీర్యునిం
దునిమివసుంధరన్ నృపుల ॥ దుర్మదమార్చినభర్గసూనునిన్
ఘనతరతేజ నాలమున ॥ గాళ్ళపయింబడగాచినట్టి రా
మునిగుణధామునిన్ సుగుణ ॥ మూర్తి నెరుంగవె దైత్యనాయకా.

మరియు,

తే. గీ. నిన్ను చంకబెట్టుకొనుచు ॥ నీరధులను
ముంచి లేవనెత్తినవారి ॥ నంచితముగ
నొక్కకోలను గూల్చెను ॥ నక్కజముగ
నట్టి రఘురాము జెనకంగ ॥ నగునె నీకు.

రావ—ఓరీవానరాధమా! రాముని యింతగాస్తుతించుచుంటివి.

తే. గీ. అంత బలుజోటచేతనే ॥ యింతికొరకు
భానుపుత్రుని పాదము ॥ బట్టినాఁడు
పలుకులేటికి నాలంక ॥ పైకివచ్చి
నప్పుడీక్షింతు నాతని ॥ యమితబలము.

హను—నిన్ను జంపుటకు రాముఁడే నక్కరలేదు. నేనే చాలుదును గాని రామాజ్ఞ లేక యూరకుంటిని.

రావ—ఓరీ! మర్కటా! ఏమిప్రేలితివిరా! కూర్రా! (ఖడ్గము వొరనుండిదీసి హనుమంతుని మీఁదికి బోవ విభీషణుడు అడ్డగించును.)

విభీ——అన్నయ్యా! ఆగ్రహింపకుము.

22 అనుబంధము.

రావ——విభీషణా! నీవు ప్రతి విషయమున అడ్డుకల్పించుచు నేయుందువు. నోటికిరానిమాటలు వదరుచున్న వీనినివిడచుట పాడిగాదు.

విభీ——అన్నయ్యా! దూతను శిక్షింపవలయును గాని వధింప ధర్మముగాదు. ఇప్పటికైన యీరామభూనేత దూతనుందలచి రాముని మహాత్వం బూహించుకొనుము.

రావ——విభీషణా! ఏమంటివి.

మ. సురలన్ స్రుక్కగజేసిఁ దేవవిభు హెచ్చుల్ మ్రగ్గగాజేసి ఖే
చరగంధర్వమఃసిప్రకాండముల మచ్చుల్ మాపిదోస్శక్తిచే
మరుదాకాశజలాగ్ని పృధ్వులను గుమ్మంబందు కాపుంచు నీ
వరబాహాబలశాలికా నరుడాకో ప్రత్యర్థియై నిచ్చటల్.

నా చెంతనా రాముని మహాత్వంబు గొనసాగునని తలంపబోకుము.

విభీ——

23 అనుబంధము.

రావ——ఛీ! నోరుమూయుము.

హను——ఓరీ రావణా! చల్లకువచ్చి ముంతదాచనేల! వినుము. మా శ్రీరామచంద్రుడు నీతో నిట్లనమనియె.

చం. వనమునయుండునట్టి తరి వంచనముమ్ముల జేసి జానకిన్
గొని చనజాలితీవుకడు కొంటెతనమ్మున యిప్పుడైననున్
మనమున దప్పుదిద్దుకొని క్ష్మాసుత దెచ్చియొసంగు కానిచో
రణమున సుగ్రసాయక ప రంపరలన్ నినుగూల్చిపుచ్చినా
వనితనుగొంచుబోయెద న వారితవిక్రమశౌర్యమేర్పడన్.

ఇందుకు నీవేమి ప్రత్యుత్తరమిచ్చెదవు?

రావ——నామాటగా రామునితో యిట్లనుము.

మ. దారనోనాంగ నుయేమియైనటుదో ॥ ద్రోదెచ్చితిఁ జానకిఁ
దర మైనఁ గొనిపొమ్ము సంగరములో ॥ దర్పంబు జూపించి; భీ
కరలీలఁ దనుదాకగా వెఱపుగ ॥ల్గఁ బొమ్ము; వేయేల, సం
గరముఁ జేయగ లేనివారియెడనే ॥ గారుణ్యముఁ బూనెదఁ.

(తనలో) వీని కేదయినా పరాభవము జేసి వదలవలయును (ప్రకాశముగా) ఓరీ భటులారా! ఈవానరుని వాలమునకు తైలవస్త్రములుజుట్టి అగ్ని బెట్టి వదలుడు. (నిష్క్రమింతురు.)

హను—(తనలో) శ్రీరాముని దయచేత హవ్యవాహనుడు నన్నేమియు సేయకుండుగాక. ఇప్పుడిదియును నొకందుకు బాగుగనేయున్నది. ఈమంటలతో లంకాపుర మంతయు దగులబెట్టెదను.

[దనుజులు హనుమంతునితోకకు గుడ్డలుజుట్టి యగ్ని బెట్టుదురు.]

హను—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి)

శా. లంకంజొచ్చితి గాముపంపునను నా ॥ హ్లాదంబుతో సీత నా
తంకంబేమియు లేక చూచి వన ॥ ధ్వంసంబుగావించి ని
శ్శంకం దైత్యులగూల్చియీపురవమున్ ॥ చండాగ్ని పాల్జేసి నా
వింకన్ రామునికిన్ వచించుటకునై ॥ నేనేగెదఁ వేగమే.

(నిష్క్రమించును.)

24 అనుబంధము.

ఇది పంచమాంకము. సంపూర్ణము.



[నాటక ప్రారంభమున సమాజికులందరు కలిసి తెఱలో
పాడెడిప్రార్థనపాట]

1 వ అనుబంధము.

యమునాకళ్యాణిరాగం - ఏకతాళం.

ప॥ శ్రీగిరివరకరుణాకరశితవరధరా

అ॥ ప॥ నాగభూషణ । భక్తపోషణ । నగజాతమనోరమణ ॥ శ్రీగి॥
యోగిదహృద్పద్మవిహారాసుధీరఓకరిచర్మాంబరధరశంకరా
సాగిలి మ్రొక్కి । వేడుచుంటిమీ । సమాజమును । సదాబ్రో
వగ॥ శ్రీగి॥

---

2 అనుబంధము.

[సీత అగుపడలేదని లక్ష్మణునితో చెప్పెడిపాట]

బేహాగ్ రాగం - ఏకతాళం.

ప॥ వినుమయ్యాలక్ష్మణా । యింతెందరసినమనజానకి జాడగనబడదే॥

అ॥ ప॥ గనగానేడేలను నామనము న । కారణముగ విచారమునం
బడెయనుజన్మ॥ విను॥

నన్నన్వేషించుచు యీవనమున నలుదెసలయందు దిమ్మరు
చుండెను

నెన్నకూరరాక్షసు డెవ్వడైన నిర్భీతినిగొని చనియెనో దెలియదు
మనకు । జనక । జాత్మ । యెటులగనబడుహోయీవనిన్॥ విను॥

---

3 అనుబంధము.

[లక్ష్మణుడు పాడెడిపాట.]

కన్నడరాగం - ఏకతాళం.

ప॥ అన్నా సకలగుణసంపన్నా॥ అన్నా॥

అ॥ ప॥ నిన్నే మని నేనూరడింతు ధరనీవెరుగని దేమున్న దినెన్న గ॥ అన్నా॥
మన్నింపుము నావిన్నపంబుమనశ క్తికొలదియావనప్రాంతంబు
లన్నియు నన్వేషించి పిమ్మటనాలోచింతము కర్తవ్యంబున్॥
అన్నా॥

---

4 అనుబంధము.

[రాముడు విచారముతో పాడెడిపాట.]

హిం॥ ముఖారిరాగం - అటతాళం.

ప॥ హానాబహిఃప్రాణమా । నాపాలిభాగ్యమా॥

అ॥ ప॥ యీనాటికి మనకీవనసీమను యెడబాటున్ ఘటియించెనా
దుర్విధి॥ హానా॥

నే । నేమని । నిన్ను విడనాడి । జీవింతున్
జానకినీ । జూడనునే । కరణినినిక । నరయుదహా ।
మానసముననన్ దలచి తలంచి శోకించుచుయెంత గాసిలు
చుంటివో॥హానం॥

---

5 అనుబంధము.

[లక్ష్మణుడు హనుమంతునితో తమ చరిత్రచెప్పెడిపాట.]

కాఫీరాగం - ఏకతాళం.

ప॥ హనుమంతా విను మాచరితంబును దెల్పెద దశరథరాజ
నందనుల మేమిర్వురమరయన్॥

అ. ప. అనుజుడౌను నాకీ శ్రీరాముండు
జనకునిసత్యము జరుపగజాయా । సహితుండై యీవనికరుదెం
చగను
దనుజుండుకెడుమాయన । మావదెనన । గొనిచనియె ॥ హను॥

---

## 6 అనుబంధము.

[వాలితో తార యుద్ధముకు వెళ్లవలదని చెప్పెడి పాట.]

ముఖారిరాగం — ఆదితాళం.

ప. నామనవిఁ యాలింపుము నాప్రాణనాయకా

అ॥ ప॥ నామనంబున। యేలనోకడు। వెరపుదయించెఁ. అకారణముగ

ప్రేమతో నామనవి దోయక అని యెనర్పకుమా

రామలక్ష్మణులాతని చెంతఁ యుండుటచేగద మరల అనికిఁ

మిమ్మ్మురమ్మనె భానుజుండు। మేటిధైర్యము తోడఁ॥ నామనవిఁ॥

---

## 7 అనుబంధము.

[రాముడు శీతనుగురించి విచారముతో పాడెడిపాట]

ఫరజురాగం — ఆదితాళం.

ప॥ అయ్యోప్రాణేశ్వరీ। నారీ। సుకుమారీజనకకుమారీ॥ అయ్యో॥

అ॥ ప॥ యియ్యడవినినిను నిర్భీతినినతిదుష్టుండగు దశకంఠుడుమాయను

చయ్యననినుగొని చనెననివిని విచారసాగర నిమగ్నుడనైతిని॥
అయ్యో॥

అయ్యోడనాకై యెంతచింతించుచు అడలుచుంటివో హాప్రాణ
నిధీ॥ అయ్యో॥

---

## 8 అనుబంధము.

[సుగ్రీవుడు పాడెడి పాట.]

భైరవిరాగం — ఆదితాళం.

ప॥ వందనంబుసుమిత్రాపుత్రా।లక్ష్మణాభిఖ్యసద్గుణపవిత్రా॥వంద॥

అ॥ ప॥ సుందరవదనారవిందా నేనేసుందుచూడ మీయెడల నే నప
రాధనిగావునఁ॥ వంద॥

డెందమునందు నాయందు సుంతైన క్రోధముంచక నన్ను
మన్నింపగా వేడెదర్ ॥ వంద॥

---

9 అనుబంధము

[రాముడు పాడెడి పాట]

హిం॥ తోడిరాగం - ఏకతాళం.

ప॥ అనుజన్మావిను మాలోచింపగ భానుజుండుమన మెడలన్

అ॥ ప॥ ఘనభక్తి తత్పరుండయిజరించి । కార్యముగడ చెనుగదా యని
దలచి

మానదగుకార్యము । మరచియింటను। మగువలతో సల్లాపము
లాడుచు

నున్న వాడనివిన్న వాడ లే।కున్న కారుండు నేమనదరికి॥అనుజన్మా॥

---

10 అనుబంధము.

[హనుమంతుడు పాడెడి పాట]

శుద్ధసావేరిరాగం - ఆదితాళం.

ప॥ రామాముని జనహృద్రంజననామా । రవికులాంబుధి పూర్ణ
సోమా॥ రామా॥

అ॥ ప॥ యీమహీస్థలిన్ దుష్టశిక్షణ । శిష్టరక్షణకెబుట్టిన శ్రీసీతా
నామనమనయము నీపావనతర।నామస్మరణముసల్పగజొన్పుము
నీమముతో నీసుందరపదారవిందములన్ భజియింపగబోవ్రుము॥



## 11 అనుబంధము.

[హనుమంతుడు పాడెడి పాట]

కాంభోజిరాగం _ ఏకతాళము

ప॥ రామరామ శ్రీసీతా । రామమనోభిరామా

అ॥ ప॥ రామా పావననామా । రమ్యసద్గుణకామా

సీమమున్ నామనమున । నినుధ్యానింతును రా

ఓమహానుభావా నమోస్తునమోదేవా॥ రామ॥

---

## 12 అనుబంధము.

[హనుమంతుడు పాడెడి పాట]

ఫీలువారాగం _ ఏకతాళం.

ప॥ రామ । రామ । రామ । జగదభి । రామ । శ్రీరామా

రామా నీమహిమను నెరుగకగద । రామామణి శ్రీసీతా

రామను రావణుడు తనమాయను

రామా రామాయనిభోరునదుఃఖించుచుండగొనిచనియెకూ్రరుడై॥

---

## 13 అనుబంధము.

[అశోకవనమున శీత పాడెడి పాట]

హిందోళిరాగం - ఆదితాళం.

ప॥ యెందుంటివోప్రాణేశా । రామా । రామా ॥ యెం॥

అ॥ ప॥ సుందరవదనారవిందా । మిముజూడక్ । నాకెటులక్ । ఘటి

యించుక్॥ యెందు॥

డెందమందునన్ను గూర్చి । యెంతచింత నొందితివో నావార్త ।

మీకెటులదెలియునో॥ యెం॥

---

## 14 అనుబంధము.

[రావణుడు పాడెడి పాట]

మోహనరాగం - ఏకతాళం.

ప॥ నారి। సొగసగువయ్యారీ। నవలావణ్యాకారి మారునిచేమెరయు
కటారీ॥ నారీ॥

అ॥ ప॥ యీరీతిని దినదినంబు ఖేదంబుననీమనంబుపారతరవి।
చారమునను। బాల్పడగ జేయనేల। యీసారి
నారీ మారుబల్కకనాదుసౌధమునకురమ్మిక॥ నారీసొగసగు॥

---

## 15 అనుబంధము.

[శీత పాడెడి పాట]

హిం॥ తోడిరాగం - ఆదితాళం.

ప॥ హానామనోభిరామా శ్రీరామా సుశ్యామా
హానాప్రేమపుంజమా। హానాజీవననిధానమా॥ హానా॥

అ॥ ప॥ యీనాటికిమన। స్నేహలతను। ద్రెంచిదుష్టుండగురావణుండు
నానాయిడుమలుబడలంకను। ననుచెఱబెట్టె త్వరగవచ్చి
దానవాధముని। ధరణినిగూల్చి। దాసురాలనగు। ననుగొని
చనుమా॥ హానా॥

---

## 16 అనుబంధము.

[రావణుడు పాడెడి పాట]

మోహనరాగం - ఏకతాళం.

ప॥ ఆలసింపక నాలోచింపుమిక। అవనియందునన్ను బోలు। ఘనుడెవండు। సీతా॥ ఆల॥



అ॥ ప॥ వినునామన । విగబల్కు_ను । విశదముగను । నేమరకన్
నినువిడనాడినది మొదలు । నిద్రాహార నీరంబులు । నేనెరుగను
నాధామనామ స్మరణందక్క॥ హను॥
దనుజుడునాకింకనురెం । డునెలలుగడువిచ్చెపిదప
ననుజంపగనిశ్చయించె వయ్యోయనుబ్రోవరావ॥ హను॥

---

20 అనుబంధము.

[హనుమంతుడు పాడెడి పాట]

కాంభోజిరాగం - ఏకతాళం.

ప॥ రామరామ । శ్రీసీతా । రామామనోభిరామా।
అ॥ ప॥ రామాపావననామా । రమ్యసద్గుణధామా॥ రామా॥
రామారామనీనామ । పారాయణామృతమె । ప్రాణాధార
పదార్థంబయ్యె।
యేమికొరంతనాకింక । యీలంకన్ । నేనింకన్ నిశ్శంకన్
మంటబెట్టిచనెదన్॥ రామ॥

---

21 అనుబంధము.

[రావణుడు పాడెడి పాట]

కమాచ్ రాగం - ఏకతాళం,

ప॥ ఎన్నడు వినమే । యిట్టివినోదపు । మాటలన్ ధరన్బుట్టి॥
అ॥ప॥ నెన్నగ।చిన్న।వానర మేమి।మద్వనభంగము సేయుట యేమి॥ఎన్న॥
గ్రిన్ననయక్షకుమారునిన్ శౌర్యధుర్యునిన్ జంపుటరయగన్
యెన్నో । విధముల । నామది । బాపుచు యేమియు దోచదు
విభీషణా॥ఎన్న॥

## 22 అనుబంధము.

[విభీషణుడు పాడెడి పాట]

హిం॥ ముఖారిరాగం - ఏకతాళం.

ప॥ వినుమన్నా నామనవి వినుమన్నా రాక్షసేశ్వరా రావణా॥విను॥
అ॥ ప॥ కనుగొన్నన్ దూతను వధియింపన్ । కడుపాపమని వినవే ।
నీవెరుగని ధర్మమున్ గలదే
మనమున నీ తని యెడలన్ । కినుకను వీ । డనూదయతో॥విను॥

---

## 23 అనుబంధము.

[విభీషణుడు పాడెడి పాట]

హిం॥ ముఖారిరాగం - ఆదితాళం.

ప॥ రాముని ప్రభావమెరుగక యీరీతిన్ । బల్కుచుంటి వన్నా॥
అ॥ ప॥ రాముడు సంగరభీముడు దుష్టవిరాముడు రవికులపూర్ణసోముడు
యీముజ్జగములజనములు స్తుతించు పావననాముడు సీతారా
ముడు॥ రాము॥
నేముదమున నీబాగుదలంచి యింతగా నొక్కివక్కాణించితి
నామాటలు నీచెవి కేలసోకు । కామక్రోధమదంబులుపూర్తిగ
నీమనంబునిండియుండగ।మిన్నుమన్ను నీ కేలగనంబడు॥ రాము॥

---

## 24 అనుబంధము.

[సమాజికులందరుకలిసి పాడెడి హారతిపాట.]

బంగాళా తోడిరాగము.

ప॥ హారతిగైకొనవే జననీ॥ హారతిగైకొనవే॥
అ॥ ప॥ కారుణ్యామృతపూరితవైమముగాపాడుముతల్లీ పార్వతి॥ హార॥
భారతరాజ్య ప్రజలెల్లరు నొకభావముగలవారై ధీరిమ । తిన్
స్వ । రాజ్యము । గైకొని । తెజరిల్లగన్ బ్రోవుము కృపతో॥

